శశిపండితయ్య - పయి వైచిచూడుమీపటుగర్వమణగి - యననసంఖ్యాతుల
యానతిలేఖ - గనుగొనిపౌరులక్కజమందిచూడ - తలయెత్తుకొనినిజ
దరహాసరుచులు - దళుకొత్తధరణీశతత్కార్యధార - నెరుగుమమనగ
రాదెరుగముదీని - నెరుగననంగరా దెరుగుదునేన - యగుచుమా
భక్తులయానతిగాగ - గగనంబుపైబద్ధగానననేర - వాడెన్నబద్ధశివ
ద్రోహిగాన - వాడువేదవిరుద్ధవర్తియగాన - చంపబంపినవాడచంపి
నవాడ - చంపించినాడసజ్జముప్రోలికతని - నంపబంపినవాడనంపించినా
డ - నంపీనవాడనేనాడునేసాదు - నతడునీకాచార్యుడదినీకుధర్మ -
సుతనికల్గిననారికల్గిదండింప - యేచంపితిసనిమెక్కించుకొనిన - దాన
బ్రాప్తుండనేదండనకనుడు - ప్రకటితకోపాగ్నిపరితాపదగ్ధ - సుకృతుం
డువెలనాటిచోడుండుపాపి - ధరబ్రాహ్మణోనహంతవ్యయనంగ -
కరమగ్గితప్పెంతిగలిగిననైన - నధముజాతులబస్పనట్లబ్రాహ్మణుల -
వధియింపరాదుభూపతికట్లుగాక - శిక్షింపదలచిరేజేయుమరోలి - న
క్షీదండంబహానామొట్లనుగూడ - దధికాపరాధకుడైసద్విజన్మ - డధమాం
త్యజుండెవ్వడైననుశైవ్రు - డధికుండెయట్టిబ్రాహ్మణునివధించు - వధ
కుననహంతమువైదికన్యాయ - గతిశివసన్నిధికారణంబునను - రతివే
దశాస్త్రపురాణసిద్ధాంత - మతమునజనువేదమార్గంబుదుడిచి - గత
బుద్ధిబౌద్ధేంద్రఘాతకుండీత - డనియక్షీదండనంబాచరింపంగ - బనిచిన
నృపతికిబంకితుండనియె - దైవమీశుడుకాడుధరణిబౌద్ధుండె - దైవం
బుబౌద్ధులతగునిత్యముక్తు - లాకంగవాదంబుసందోడియున్న - వార
ముమేముమీవరుడున్నద్రోహి - గాడునిరపరాధిగట్ట్రల్కజంపి - నాడనే
ననియెయున్నదినీమతంబు - శివుడాదైవంబుప్రసిద్ధమాటకును - శివ
భక్తిపరులైవిశిష్టులైయుంట - కతడుశివద్రోహియగుటకుమరియు -
ధృతిబరదేశుల్స్వదేశులుసాక్షి - యెల్లెడలనువాదమేమోడమికిని - తో
ల్లిపారినవాదడూకులుసాక్షి - మైయుండనిప్రత్యయములెల్లమరచి -
యెప్పొడనిన్నునీవెరుగకక్రొవ్వి - దండించెదవెయొల్లధరణీశయేను -
దండించికొననతధ్యంబున్నవాడ - నట్టులుగాకచోద్యంబింకవినుము -
దట్టుండవైమ [illegible] దింక - నీ

క్షితీశ్వరమాటలిన్నియునేల - చూడుముపర్మాటికిశూలిమహత్వ -
మాడంబరముప్రత్యయాడంబరంబు- హరుడురుద్రుండువిశ్వాధికుండగుట
ధరశ్రుతుల్ దచ్చిరోధర్మనార్మోయ- శిరముముపర్మారుగాఛేదించిబం
ప - శిరములుమొలువకచిక్కసేనియును - హరుభక్తవరులుశిష్టాచా
రులగుట - సరుదొందదర్శనాత్మసదరిశించు - కన్నులముపర్మారుగా
నొలిగింప - కన్నులెప్పటిక్రియగలుగకనున్న - సౌంనిర్మాల్యసౌఖ్యము
ముక్తియగుట - ధారయెత్తనబ్రసాదమునకుసాచు - కరములుము
పర్మాటుగాదునిమింప - కరములంకురితముల్గాకుండెనేని -మునుశివార్చ
నపాశమోచనంబగుట - తనరికాయోనచేత్తనభజియించు - కాయం
బుమువర్మాటుగాభంగపెట్ట - కాయమెప్పటియట్లఘటియిల్లదేని - మె
క్కడిదేవరయొక్కడిభక్తు - డెక్కడినిర్మాల్యమేటిపూజనము - బౌద్ధులే
ఘ ను లు త త్పథ మ ద ర్శ న ము - బు ద్ధుం డె దై వ ం బు
భు వి నీ వ వ తి వి- య ది యె దృ ష్ట ప్ర త్య య ము చూ డు మ ను చు -
మాడనుబ్బిపండితమల్లికార్జునుడు - వనితలుబుద్ధులువాడవాకలను - వి
నివెరగులువడివీక్షింపనేగు - డెంచిలింగోద్భవదేవుగోపురస - మంచితా
ర్భంకపహర్మ్యాంగణమున - గొలువున్నభక్తులకునుసమస్తాంగ -ములు
మోపియుందండముపర్మాటుమ్రొక్కి - చెలగుచుబోయివచ్చినకార్యధా
ర - నలిభక్తతతికివిన్నపమాచరించి - యుద్యత్ప్రసక్తిలింగోద్భవదేవు
గద్యంబునానొక్కగద్యంబుజెప్పి - దేవదేవేశునాదిమదివ్యలింగ - దేవు
లింగోద్భవదేవునతుణము - చోద్యతరంబుగాస్తోత్రంబుజేసె -సద్యఃప్రసన్న
భాస్వరశక్తివడశి - మంగళలింగనిర్మాల్యప్రసూన - సంగతోత్తంసో
త్తమాంగవిభ్రముడు - సరసశశ్వద్భక్తిసామ్రాజ్యరాజ్య - వరబద్ధపట్ట
భాస్వత్ఫాలతటుడు - దరహాసచంద్రికాధామాభిరామ - వరకళాసంపూ
ర్ణవదనచంద్రుండు - హరమహిమాంకనోద్యత్సుధాసార - పరిపూ
ర్ణకుంభనిభశ్రోత్రయుగ్మ - డానందబాష్పనిరంతరవర్ధ - మానసే
త్రాబ్జయుగ్మవికస్వరుండు - చిరతరసరళసంస్థితసముద్భూత- కరుణామృ
తనిషిక్తగండస్థలుండు - స్ఫురితప్రసాదతాంబూలరాగాంశు - పరికలి
తాధరభ్రాజమానుండు - సముచితసల్లాపసముదయప్రకాశ - విమలదంత

ప్రభావిభ్రాజితుండు - మహితపంచాక్షరీమణిగణనికర - నిహితకరండ
సన్నిభరసజ్ఞుండు - సహజప్రసాదాన్యసమ్మిశ్రగంధ - రహితనాసావివర
ప్రశస్తుండు - సముచితశర్వానసరధూపధూమ్ర - కమనీయ్యాసారభక
లితాంబరుండు - నసమభస్మోద్ధూళితాంగత్రిపుండ్ర - లసితరుద్రాక్ష
మాలావిభూషణుడు - నానతశిష్యగణాకీర్ణ భాన - మానాంఘ్రియు
గ్మకుమహనీయయశుడు - శరణార్థిహృద్భృంగసన్నిభపాద - సరసీరు
హుండునై ప్రస్తుతికెక్కి - క్రాలుచుండెడిమత్తగంధగజంబు - చాళి
నిల్చుండిమూసభ సరీక్షించి - మొదలబ్రాహ్మణులనుతుదినంత్యజుండు -
మొదలుగాతద్బుద్ధమునులుజైనులును - ధరణీశ్వరుండునుదన్ని యోగం
బు - బురిజనుల్ బరిజనుల్ బుధులుబండితులు - వాదులుదార్కికుల్వార
కపుత్వేద - వాదులుయతులువిద్వాంసులాదిగను - కంటిమిగానమేముం
టిమిలేము - వింటిమివినమనివెనుకనావలదు - వినుడునాదుప్రతిజ్ఞవీరు
వారనక - జనులెల్లజూడుడుచక్కరమ్మనుచు - కరకంఠసద్భక్తగణనాథు
లకును - మఱియుదొల్లిటియట్లమహిజాగిమ్రొక్కి - ప్రమథపురాతనభ
క్తదివ్యాంఘ్రి - కమలముల్ నిజమస్తకంబునజేర్చి - శ్రుతియేకఏవ
రుద్రోయనమరియు - శ్రుతులువిశ్వాధికోరుద్రయనంగ - హరుడు
రుద్రుండువిశ్వాధికుండగుట - కరయంగనిదియప్రత్యయముసూడుండు
భువిశ్రుతులనసర్వపూతోయనంగ - ప్రవతిచసోపిశిష్టాయతేయనగ - హరు
భక్తవరులెశిష్టాచారులగుట - కరయంగనిదియప్రత్యయముజూడుండు
యరయుబితాతదశ్యామయనంగ - పరిప్రసాదాన్ముక్తిసంభవోయనగ - భ
వుప్రసాదముముక్తిపదవికిహేతు - వవుటకునిదియప్రత్యయముజూడుం
డు - ధరణీశ్వరుడుమముదండించునవుడు - కరములుకాళ్లునుగన్నులుశిం
ము - దురిమిననరికినదొలిగినదరగి - ననుజాగుచునువచ్చుచునుజర్గుచు
నుకొను - లచుచునుండకనున్నలక్షింవనాక - రచరణనేత్రశిరస్సమూ
హంబు - లనుబొడిచినవాచిననురక్తముబ్బి - ననునరంబులువ్రింగిననుద
దంగముల - గ్రక్కునవ్రణమైనగండియుండినను - స్రుక్కినముణిగినజొర
గినమొరగి - ననుభజింపమువలగొనముగన్గొనుము - మనసిజసంహారుమ
రియట్లుగాక - ప్రొక్కుముముక్షుంటికొఱకుయేమేలు - నిక్కడగొలువు

న్నయీయనసంఖ్యాత - మాహేశ్వరులనునుమాటలేలనుచు - మాహే
శ్వరులకల్లమరియునుమ్రొక్కి - మండలాధిపయనుమానమ్ముంకేల - దం
డింపబంపునాతలవరుజూచి - మున్నుగన్నులువుచ్చనుమ్మాటునల్ల - క
న్నులువచ్చెనాకదుమనూడుండు - యొక్కమాటైనరాకుండజేసేనియును
నిక్కమేజూచెదనేత్రదండనము - మొదలజేయుండనిముదమునబలుక -
బెదరుచుజనులువిభీతులైచూడ -గోరుగండ్లనుయూకుకులుగొనిచేర - శూ
రుడుమల్లికార్జునపండితయ్య - పద్మాసనస్థుడై ప్రాణేశుహృదయ - పద్మం
బునందుంచివటుభక్తియుక్తి - నంజలీకృతకరకంజుడై నేత్ర - సంజనితా
నందజలపూరమశర - శ్రీమల్లినాథాయజితమన్మథాయ - సోమాంక
జూటాయశూలాయుధాయ - భస్మీకృతాఘాయపరమేశ్వరాయ - త
స్మైనమోస్తుశ్రీధరవల్లభాయ - శ్రీవీరభద్రాయసింహధ్వజినాయ - దే
వాదిదేవాయతేజోమయాయ - విస్మందహనాక్షివిగతాధ్వరాయ - త
స్మైనమోస్తుశ్రీధరఖేలనాయ - శ్రీవృషభేంద్రాయశివవాహనాయ -
శైవాగమపురాణశాస్త్రాధిపాయ - సస్మేరవదనాబ్జశాంతోదయాయ -
తస్మైనమోస్తుశ్రీధరమందిరాయ - ప్రమథాయరుద్రాయభక్తప్రదా
య - విమలాయనిత్యాయవిశ్వస్తుతాయ - భస్మాంగరాగాయపాపాప
హాయ - తస్మైనమోస్తుశ్రీధరవల్లభాయ - శ్రీదేశికేంద్రాయశివసన్ని
భాయ - వేదితాత్మీయార్థవీరవ్రతాయ - సస్మృతిశ్రుతిసదాచారా
న్వితాయ - తస్మైనమోస్తుశ్రీధరవందితాయ - యనిహృదీశప్రమథా
ధీశభక్త - జననిజదేశికేశ్వరులకుమ్రొక్కి - యామికుచేనున్నయాగోరు
గొండి - పైమూలమంత్రోక్త భసితంబుజల్లి - మరిపుచ్చుకొనివేదమం
త్రోక్తమైనకరకంథులింగోదకంబులగడిగి -ననుభక్తియూయూక్రియావిధా
తవ్య-మనుశ్రుతిమతముశాస్త్రార్వణగాన - శ్రీమల్లికార్జునచెన్నయ్యదే
వ-స్వామిమహిమాభివర్ధనార్థముగ- గావించిముమ్మాటుకన్నులునీ
వ-చేముట్టవుచ్చవేశిపుడయన్నట్లు- చెనసిశివార్పితచేతస్కుడగుచు - నె
నరజక్షుష్పీడనోద్యుక్తమతిని - వలపటికినెపంబువ్రాలికుంభకము - నె
లకొల్పిభుజములునిట్టించికంఠ - మోరగించిచనుటయునువదనంబు -పూ
రించియు ... గుళంబులను -

కనురెప్పలూత్రిప్రుక్కకనుండబట్టి - దండియైయయ్యహస్తంబునగోరు
గొండివల్పటికంటికొల్కిలోనుసిచి - యల్లనకంటిగ్రుడ్డపయకనుండ -మె
ల్లనచుట్టునుమెరకిపెకల్చి -వుచ్చికొల్కులనరంబులువిడిపించి - క్రచ్చర
వామాంబకమునట్లవుచ్చి - మసలకంబుజరాగమణులుభక్తులకు - నెసగం
గనారతులెత్తినయట్లు - వల్లెరంబులనిడిభక్తరాజికిని- వాల్లభ్యమొసగ
నివాళింపబంచి - జనులెల్లజూడదచ్చక్షులురెండు - మనుజేశుముంద
రమరిబెట్టబనుప - నగపడెబగదనకనుచునేత్రములు - దగిలిజూచుచు
దీర్ఘదానర్త్రోచుచును - నెట్టనచోడండునెత్తురునుచుట - బొట్టిడికొంచు
విభుత్వంబుమెరయ - నంతలోననమల్లికార్జునప్రభుని - కంతకాంతకు
నిమహాత్వాతిశయత - నుదయించెనేత్రంబులొండొండగడవ - గదిసె
దొగ్గినవుండ్లగంట్లునక్షణను - వుచ్చినకన్నులబొందలమున్న - వచ్చు
కీలాలప్రవాహంబునుడిగి - పండితమల్లువిభ్రాజితనేత్ర - పుండరీకములి
ట్లుపొలుపా రె న ం త - న ద్భు తా క్రాం తా త్మ ల గు చు
నా స భ య - త ద్భ క్త జ ను లు ను ద్ధతిబండితేంద్రు- పాదాబ్జ
ములుచిక్కబట్టిమ్రొక్కుచును - పాదరేణువుదలపైనుంచుకొనుచు -
సన్నుతిసేయుచుజెన్నారగ్రొత్త- కన్నులుజూచుచుకడుచిత్రమనుచు- గా
రవించుచుకేళికలుసేసికొనుచు - దారునుగినియుచుదాళగించుచును -
పాడుచునెసగులుపీడుచుగములు - గూడుచునలిరేగియాడుచుజేరి- చూ
తమురండంచుచూడరోయంచు - చేతులువీచుచుచెలగియార్చుచును
బొబ్బలుజెలగంగబొంగుచుజెలగి - యుబ్బుచునందరునుత్సహింపుచు
ను- చాంగుభళాయంచుశరణంచునుతులొ - సంగుచునృపుడాయజనుచు
నుమంది - దొలగంగనూకుచుద్రోపులాడుచును -తలలుదూరుచుకొం
చుదరియజొచ్చుచును - యులువువారించుచునెయ్యనజనుచు - బలు
విడిదట్టుచుబాయనూకుచును - క్రందుఘనంబంచుగట్టలుగొనుచు -సం
దులువెదకుచుసంచరింపుచును - యలవాడెరాజుచునటువ్రాకుడనుచు
గెలకులదాఁటుచుగ్రేకరింపుచును - బుచ్చినకన్నులుబోలగన్గొనుచు - న
చ్చెరువందుచునల్లనముట్టి - ముట్టిచూచుచునట్లమ్రొక్కుచుబట్టి - వ
టి యెత్తుచుభ [illegible] త్రాలగిని

ల్చుచును - నిక్కిచూచుచుమిఱ్ఱులెక్కిచూచుచును - కలకలంబులకుడ
గ్గరకనామెడను - నిలువులమెడలెత్తినిక్కిచూచుచును - యక్కడ
గాల్బట్టకరుగుదెంచుచును - స్రుక్కుచుగన్నులుజూడనేగుచును - చిన్న
బోయినరాజుజేరనోపుచును - మెన్నంగబండితుడితరుండేయనుచు -
కన్నులువచ్చుటగానడాయనుచు - నెన్నిమాటలైనదానిట్లకాలనుచు -
మన్నింపదగునంచుమాన్పడాయనుచు - బన్నజెర్వగనోవుబ్రజనెల్ల
ననుచు నెంతగానోవునోయిటమీదననుచు - కంతుహరుడమెర్గు
గాకేమియంచు - సందడింపుచునున్నజనులవీక్షించి - మందస్మితము
ఖారవింపడై యంత - నందందదాహస్తసయునసంజ్ఞలను - మందియు
ల్వణచిసమాధానపరచి - యూర్జితపుణ్యుడావర్జితయశుడు - తర్జి
తాఘుడుమల్లికార్జునస్వామి -యారూఢతద్గోపురాంచితహర్మ్య - చా
పతతోన్నతద్వారగోపకంఠ - నిరవధికస్థావ్యనిజతనుస్తంభ - పరికల్పి
తాంబకపటుమణిద్వయుడు - సారసద్గుగుదృగంచలపనిర్వద్ధ - యార
సపూరితాయతజలజనిత - వరవీరభక్తిసద్వాసనాయుక్త - పరనస్వకీయ
లోచనపద్మయుగుడు - మానితాసంఖ్యాతమాహేశ్వరప్ర - తానది
వ్యశరీరధామసంపూర్ణ - తరచంద్రికానిరంతరపానసుహిత - నరనుత
నిజలోచనచకోరయుగుడు - చిరపూర్వకర్మసంచితభూరికర్మ - పరదైవసే
వానుపాదితకర్మ - వినియుక్తభవకర్మవివశసమస్త - జనచయాంతర్బహి
స్సంగతధ్వాంత - నిరసనాత్మీయ్యవినిద్రితనేత్ర - పరిచితాఖండదీపయు
గుండునగుచు - స్ఫుటభక్తియుక్తివిభూతిపిడియుము - లటుగూడభక్తుల
కపీంచబంచి - జననాథుదత్సభాజనసంకులంబు - గనుగొనిదరహాసకలి
తాస్యుడగుచు - మహనీయ్యుడగుశివుమహిమాతిశయత - మహినొప్ప
భక్తసమాజంబుప్రతిభ - గంటిరినేడుమీకన్నులారంగ - వింటిరితొంటి
మీవీరోగ్రభాష -మనుజేశనీయనుమానంబువాయ - జనులకునెల్లదృ
ష్టప్రత్యయముగ - బుచ్చినకన్నులుభువినవేదేవు - డిచ్చినకన్నులునిట
నీవచూడు - పూబాసయింకొకమాటికిజెల్లె - నీబౌద్ధమునులునునీనిమో
గంబు - సభయునుసీవునీసారిజూడుండు - యభినవంబాబాసయదిమెట్టు
లనిన - నాకన్నుపుచ్చుచునీకన్నుపుచ్చ - జేకొనులోననవాకన్నుపుచ్చి -

యూకన్న ముసువుచ్చినంతలోపలన - యూకన్ననప్పుడరాకుండజేసెని - యు
దివతిజ్ఞాభంగమందరువినుడు - కదిసిచూడుండెఱుంగరె శివుమహిమ - నా
డిచ్చినశివుండునవిసెనేనేడు - నరగాలమున్నగన్నతపాపునకు - నెరయు
నిచ్చినకతనిలచెనేనేడు - శ్రీగిరీశుడనుట శ్రీగిరియనుట - నాగమోక్తం
బు ప్రత్యక్షంబుజూడ - నయనాద్రియదిమల్లినాథదేవుండు - నయనాద్రి
నాథుండునాసర్వజనులు - దక్షయక్షనేత్రముల్ ద్రవ్విత్తండజనులు - బస
యుటయిచ్చుట ప్రఖ్యాతిగాదె - యిలగొల్లడైనగొల్లెలగాచికాచి - యు
లరుచుచేతిపెడ్డటుబారవైచి - యరిగినేత్రములిచ్చియప్పుడపడసె - నరు
గుగొల్లెలగావనంతవాడనిన - యితరులజెప్పంగనేల శ్రీశైల - పతిమహా
దానసంపదయిట్లుజెప్ప - వేయేలదాచినవిత్తుబీజంబు - పాయనిరొంపుల
బయలులజల్లి - ఫలములందులజగత్ప్రఖ్యాతమనిన - ఫలముదప్పనెశివా
ర్పణవిధులందు - మహినట్లుగాక బ్రాహ్మణులాదిగాగ - స్వగృహాబరమే
శ్వర ప్రీత్యర్థమనుచు - యితరసమయులైననీశుగురించి - ధృతిదిలా
జ్యాక్షతాదిద్రవ్యవితతి - నడిసన్ననగ్నిలో జలినీరైన - వడిజలంబులజల్లవరద
పాలైన - బొందుదత్తత్ఫలంబులుదప్పకనిన - నెందునాకెపొత్పరమేశు
నకనిని - వేదించద్రిక్రియావిర్భూతఫలము - లేదెసదప్పనేయిలనెట్టులనిన
నెన్నంగమెట్టునకెగిసినకోల - మిన్నుసూచినదృష్టిమేదినివేయు - చేయిజ
ప్పనెయట్లశివునిగురించి - సేయుచేతలుదప్పనేయాదిసూక్తి - పౌనఃయ
త్యుత్కృష్టైశ్వర్యపాపైశ్చ - యనసిహైహఫలంబులనవినగెట్లు - భువిను
త్కటంబగుపుణ్యపాపములు - శివునియుద్దేశించుచేతలుగాన - తలలీ
శుబూంచినదశవదనుండు - తలగంటుగొన్నట్టితామరసజుడు - నంఘ్రిప
ద్మముగన్నవ్యాఘ్రపాదుండు - నంఘ్రులేగనిమెదవనినవిష్ణుండు - భ
వుబ్రణుతించినభట్టబాణుండు - భవునినిందించినపాపిదక్షుండు - హరుడె
దైవంబన్నయత్నపాదుండు - హరుమీదగలదన్నయట్టివ్యాసుండు - స
భవుదలంచినయాశ్వేతమునియు - సభవుదలంచనియద్వైతమునులు -
పరమేశుగొలిచినబాణాసురుండు - పరమేశుగొలువని బ్రహ్మాసు
తుండు - దలపదృష్టమతమతమపుణ్యాపాప - ఫలములబొందుట ప్రఖ్యా
తిగాదె - దేహాంతరమునబొందెశితత్ఫలంబు - దేహంబుతోడసంధిలుట

ర్థిఁగాదె - సద్యః ప్రసాదైకశక్తియచాల - చోద్యమింతయుఁగడుఁచో
ద్యంబుఁబూన - దక్షిసినగుండెలుదలకినబిగువు - సక్షిలినజనులకుసంశ
యంబైన - శంకించినను మేలుకొంకినమదిద - లంకినబింకంబుపొంకం
బుఁజెడిన - జడ్డునడినవ్రేల్లుసడలినగంటి - గుడ్డవిసినగోరుగొండివిగిఁ
నను - చేతులువణకిన చెమటదోఁచినను - ధాతువుల్దలకినతాపాశ్రుకణ
ము - లుగిసిననరములుబిగిసినసూర్పుఁ - లెగసినగోలుకుల నెఱదోఁచిన
ను - తప్పనాటినరక్తధారలబెగడు - గప్పినరెప్పలిల్కఁరచినడెంద-ము
దిరినదలపులుబెదరినజిత్తఁ - మదరినముఖకాంతి చెదరినగన్ను - లి
చ్చుటయిదియేటియిచ్చుటయదియ- వచ్చుటమఱియేటివచ్చుటమున్నె-
వుచ్చుటదారెంటివుచ్చుటమీఁరు - మెచ్చుటయదియేటిమెచ్చుటయను
చు - నాస్థానమద్భుతంబంబనిష్టించి - సుస్థితిమల్లికార్జునపండితయ్య
ముందటియట్లయందందసద్భక్త-సందోహపాదాభివందనుండగుచు-ప్రమ
థపురాతనభక్తదివ్యాంఘ్రి - కమలస్వకీయసుహృత్కమలస్థుఁడగుచు -న
విరళనిరతిశయానందజనిత - శివపదధ్యానైకచేతస్కుఁడగుచు - సుద్ధ
తతచ్ఛివయోగసౌఖ్యాను - బద్ధసమాధిసంపన్నాత్ముఁడగుచు - సతుల
మహాద్భుతోద్యద్వీరభక్తి - యుతసమాహితమహిమోపేతుఁడగుచు -
తచ్ఛుకుశస్త్రసంధానావధాన- మచ్చెరువుగమున్ను వుచ్చినయట్లు - వ
చ్చెగన్నులురెండువచ్చుటసూచి - వుచ్చబూనినకన్నువుచ్చియాకన్ను
వుచ్చులోననమున్నువుచ్చినకన్ను - వచ్చెగన్నిదెవచ్చెవచ్చెదానదియు
వచ్చులోననమఱివుచ్చినక న్ను -వచ్చెగన్నిదెవ చ్చె వచ్చెనా న ట్లు -
చెచ్చెరదడవగుచెప్పనకాని - తడవింతలేదునేత్రంబులరాక - కడుజి
త్రమంచునొక్కటనరుల్వొగడ - నంతపండితమల్లికార్జునస్వామి -
యంతకాంతకుభక్తులందందయలర - నూత్నతద్గణదయానుగతలోచన
ను - రత్నంబులనుభక్తరత్నాద్రిరాజి - కడరనివాళించునట్టినేత్రము
లు - వడిభక్తతతికినివాళింపబంచి- మున్నువుచ్చిననేత్రములువెన్కఁగ్రొ
త్త - కన్నులుబెట్టించగాచోడడాత్మ - గలమరిగించుచుగన్నులుసూచి -
తొలుతనేత్రంబులునొడిదొడిజూచు - మున్నువుచ్చిననేత్రములువెన్కఁ
గ్రొత్త - కన్నులు[illegible]

ములఁ జూచు - దవ్వక నాల్గు నేత్రంబులు జూచు -
దను జూచు మరియు నేత్రంబులు జూచు -
మనుజావలినిజూచుమరి నేలజూచు - ధరదలవంపయ్యెదనకనిచూచు -
బొరిగొనకీయల్క బోదనిచూచు - బండితు క్రేగంటబలుమారుజూచు -
వెండియునిట్లు త్రావికలాత్ముఁడగుచు - నింతింతచోద్యంబునినుమడిలజ్జ -
యంత్రకునినుమడిమైకడలేని - కోపంబుగావ్యోపతాపంబుమనసు - తా
పంబునదివజ్రలేపంబుగాగ - ద్వేషంబుతొలిమేనిదోషంబుపూర్వ - రో
షంబుతనకడివేషంబుగాగ - క్రోధంబునధికాపరాధంబుగణవి - రోధంబు
దనకుప్రబోధంబుగాగ - క్రూరతబౌద్ధోపకారతమదవి - కారతదనకప
కారతగాగ - న్యూనంబున్యాయవిహీనంబుదురభి - మానంబుదనకభి
మానంబుగాగ- వాదంబుకుసమయాహ్లాదంబునతివి - షాదంబుదనకప
వాదంబుగాగ - కర్మంబుహృతపరమర్మంబునయ్యు - ధర్మంబుదనకవిధ
ర్మంబుగాగ - తన్నుదామరచిమదగ్రస్తుఁడగుచు - భిన్నమనస్కుఁడైపృ
థివీశ్వరుండు - కన్నులువుచ్చుటగంటిదెల్లముగ - నిటమీదనేత్రంబులీ
నేరుచుటకు - నటమీదరాకకునదిదృష్టమిదియు - నిమ్మాటునేత్రం
బులిచ్చుటయుతఁడు - ముమ్మాటిసీగికిమోసమేయనక - పుడమిన్నృపుఁడు
బౌద్ధపుంగవునలిగి - మడియించినాతనిమడియింపలేద - యడఁగింతు
దండింతుననుచుబాపమున - కొడిగట్టుకొనిననట్లొనగూడదయ్యె - దం
డింపబంచినదండనంబదియు - మండనంబయ్యెనాపండితయ్యకును - పండి
తయ్యనుబట్టిదండింపబంచు - దండననృపయశఃఖండనంబయ్యె - ననిరి
త్తనడివచ్చెనవనిలోపలను - వినజాలమరిమున్నవీక్షింపజాల - భంగిం
తుపండితుభంగింతునిపుడ-క్రుంగింతుదన్నెనత్రుంగింతుబోవ- నటకార్య
మైనట్టిలెస్సగాకననుచు - కుటిలచిత్తుఁడుయామికులదిక్కుజూచి - రం
డుబండితుబట్టితేండీక్షణంబ - రెండుకన్నులుగొలకుండువుచ్చుండు -
పరపుండువలసినభంగినింకేల - మరిచూచుకొసమెదమల్లికార్జునుని-
బత్తియుగిత్తియుబండితుపాలి - మిత్తియుగిత్తియుమీదరండనుచు - ర
ప్పించినేత్రముల్పుప్పించిచాల - నొప్పించితిల్లపాల్దెప్పించినింద - బో
లించిబోడండుబోమెనతుణ్ణము - పోమెనాతనిపాలిపుణ్యంబుదొలగి -

కలగుచుసంతనిక్కడసభాస్థలిని - గొలువున్నభక్తులుఃగొబ్బునలేచి -శివశి
వశివయిటుసేయధర్మంబె - శివశివశివయిటుచెడునెచోడండు - తమనేత్ర
ములుతారదరిదరిబుచ్చ - తమకించిమరియేలదండింపబంచె - కన్నులు
వుచ్చుటగానడెజడుడె - కన్నులువచ్చుటగానడెపడుచె - బాలుండెమె
రుగడెభ్రమితుండెచూడ - జాలమిగాకయసహ్యంబుగాక - కుటిలచిత్తు
డుగాకకూళుండుగాక - యిటువంటికర్మంబులెంకనుగలవె - యిచ్చమై
బరుపంగనితరులేవారు - నొచ్చబోవునెవారినొప్పింపదగునె - చోడనిదే
శంబుసాదగొనజొచ్చె - చోడండుజెరుపంగజూచెనిప్పరము - తనకులం
బునకుగుద్దలితానకొనియె - తనకతాద్రుంగంగదలచెచోడంబు - వెలనా
డుఎల్లరవెకలింపదలచె - వెలనాడుశాపాగ్నివేపంగదలచె - కటకటాయిం
కనెక్కడిచోడనృపతి - కటకటాయింకనెక్కడివెలనాడు - నక్కటాచోడ
నికెక్కడిరాజ్య - మక్కటాచోడనికెక్కడిబ్రతుకు - నొకచోటబూరించి
యొకచోటమెరసి - యొకచోటఘూర్ణిల్లియొకచోటనులిమి -యొకచో
టబడుపికునొకచోటదూరి-యొకచోటబడుక్రియనొండొండబుట్టె- నెక్క
డిసనదవోలెక్కడిబాద్ధు - డెక్కడి[illegible]తివాదమెక్కడిచోడ - డెక్కడిపం
డితుడెక్కడిక్రోధ - మెక్కడనుండితానెక్కడబొడిచె - రాజునకాభిచా
రముగాకదక్క - నోజంపనెంతగానోపునోయితని - పాలిదైవమె
నుంగుభావింపనితడు - పాలించుభూమియపాడుగానోపు - రూపింపప్ర
త్యక్షరుద్రుండుగాక - యీపండితయ్యదానితరమర్త్యుండె- యునవేల
వేయుప్రత్యక్షంబుగాదె - మనమెల్లజూడమోమామాటలనిప్పు - డింద
రుజూడంగనినుమారుగన్ను - లందండబడియజేయూడిసయట్టు - లను
చుపండితమల్లికార్జునదేవు - వినుతించుచుండిరివినమితులగుచు - నం
తనప్పుడుపండితయ్యతత్సభయు - గంతుసంహారుభక్తగణములువినగ -
ససమానమహిమమహాదేవదేవ - వసుధనీమహిమాభివర్ధనార్థముగ
దనువ్రెగ్గిమేమయిదండించుకొనగ - మనుజేశ్వరుండునుర్మతివేగపడియె
పాపిమెరుంగడుభక్తులమహిమ - కోపికానడులోకగురుడమీమహిమ -
యిమ్మహిజనులిందరిప్పుడుజూడ - నిమ్మాటువరుసలనీశమన్నేత్ర - కం
జంబులొంటిగడవమునెగడ - పింజపింజగరవప్పుడురయస్ఫూర్తి -

బుచ్చుటయుచ్చుటభువినొప్పెనింక - నిచ్చుటమీఁకుమహిమ్మతగాను -
పశుపతిమీఁదభక్తిపరులుశాపాద - పిశరాదపియుఁగబెట్రద్రోహిగ్రసంచు
నంతకునాతనినలతనిఃశంబు - నంతకుపురమునకనుచుఁ నతకును - శ్రీకం
ఠకన్నులిచ్చితి వేనియిపుడ- నీకుభక్తులయాననీయానయట్ల - శ్రీకంఠయే
నునాశించితినేని - నాకుభక్తులయాననాథనీయాన - యస్మదీశ్వరయ
మరారామమునకు - విస్మయంబనిబౌద్ధవితతిగేలిసేఁంప -పుడమిమర్త్యులు
మహాద్భుతమనిపొగడ - బడయుటకు కొప్పబడయునేత్రములు - మె
డనిమ్మదైయ్యుండనిచ్చుటనీకు - కడునొప్పునట్లగాకరుణింపుమింక -
నొండేలయీదురాత్ముండేలుభూమి - నుండగూడదుభక్తియుక్తులకను
చు - నాపండితయ్యభక్తాజ్ఞాపనమున - శాపోదకముతెత్తిజనులెల్లపిన

——* పండితస్వామి బౌద్ధులశపించుట *——

గ * కాలకోలాహలకాలాగ్నిరుద్ర- కాలాంతకాంతకకాలాపహరణ -
రుద్రరౌద్రాంగవిరూపాక్షవీర - భద్రముఖ్యాఖిలప్రమథాధినాథ - స
విమలసమయవిజ్ఞాపనాలాప - మవధరించుటకుమహాప్రసాదంబు - మల
హరమీఁశాపమాత్రమునసక - మలసంభవునివక్త్రమాసినయట్టు - లాది
దూర్వాసుశాపద్భుతశక్తి- యాదవవంశక్షయంబైనయట్టు - లక్షుపా
దునిమహాబాధ్యచ్ఛాపశక్తి - దక్షాధ్వరంబువిధ్వంసమైనట్టు - లొనర
దధీచిశాపోద్ధతినచటి - మునులుదేవతలునిర్మూలమైనట్లు- బరువడి
వ్యాసుశాపమునవిప్రులకు - స్మరహరమీఁదభక్తిమాలినయట్లు- తిరున
క్కరుసుశాపదృఢశక్తిద్రవిళ-ధరణిజైనంబుబౌద్ధముద్రుంగినట్లు- పిళ్లనై
నారుశపింపంగనట్లు -తొల్లిజైనులునుబౌద్ధులుద్రుంగినట్లు- సరినట్లనమి
నందిశపియింపనూరి - సురభులక్షణమునిస్తుసమైనయట్లు - భంగియరి
యమశాపమునమహేంద్ర - మంగళాధిపుడనిముఁసినయట్టు - లందుండి
రిత్తాండియధికశాపాను - సంధానమునజైనులంధులైనట్టు - లరయనే
కాంతరామయ్యశాపమున - సరినబ్బలూరివసదిగూలినట్లు - గుడ్డవ్వశ
పియింపగుష్టువశించి - దొడ్డభూసురులెల్లద్రుంగినయట్లు - ఘనుఁడుమహావి
సహాళకల్లయ్యశాప - మునబాములాగ్రామమునజచ్చినట్లు - వేమేల
మనదండనాయకబసవ [illegible] ల్లవారునుజా

జనీసలకడయు - బల్లహుపీఠంబుబాడైనయట్టు - లీయసంఖ్యాతమా
హేశ్వరోద్ధతస- మాయతక్రోధోద్ధతానలచయముల - విరచితజ్వాలలవెల
నాటిచోడ - ధరణీతలాధమేశ్వరపతంగంబు - భస్మమయ్యెడునుతద్వ
ధులుసుతులు - విస్మయంబుగనిప్డుభస్మమైపోను - రనిశాపమిచ్చ
చునాపండితయ్య - యొనరంగమునువుచ్చియున్న నేత్రములు - తివిరి
లింగోద్భవదేవదేవునకు - దవిలియర్పింపనేత్రంబులునాల్గు - ముక్కం
టియునుదనముక్కంనులందు -ముక్కన్నుధరియించిచిక్కనకన్ను - త
మవామపాదార్పితంబైనతొంటి- కమలాక్షుకంటికి నయుగాయామ్య
పాదంబునందువిభ్రమతిలదనర - నాదటధరియించునపుడుబండితుడు -
నిరపరాధులగాచునిజదయాదృష్టి - వరభక్తిమెరయునైశ్వర్యైకదృష్టి
కరమల్గినృపుజూచుకడునుగ్రదృష్టి - శరణులగనుగొనుసద్భక్తిదృష్టి -
నానొప్పుదృష్టులునాల్గునీశ్వరుడు-పూనిధరించినపోల్కయట్లనిన - శశ్వ
ద్దయాదృష్టిచంద్రాంబకంబు - నైశ్వర్యదృష్టిసూర్యాంబకంబునను - చ
టులోగ్రతరదృష్టిజ్వాలనాంబకమున - పటుభక్తిదృష్టిశ్రీపాదంబులందు-
ముక్కంటిదాల్చెనామునుదాల్చియున్న - యక్కన్నుగనలీనుడవధరిం
చుటను-యనఘుండుగుగ్గుమల్లికార్జునుడంత-దనశిష్యపుత్రమిత్రకళత్ర
సహిత - మరిగిశ్రీగిరిమయుబరాగామమునను-పరమమాహేశ్వరప్రకరం
బుదాన * నసుగంగనరుగంగసంతనిక్కడను - పురముపైహాత్పాతము
ల్పుట్టంగదొడగె - నేలగాలగజొచ్చెనింగివడ్డట్టు - చాలిమేఘంబులాస
న్నమైబర్వె - పవలుచుక్కలుగానబడెధూమ్రుంబు - గవిసెనెల్లెడ
వంటకంబులుబుచ్చె - భూకంపభావమద్భుతమయ్యెరాత్రి - కాకకౌశి
కజంబుకములర్వదొడగె - గాలిఘూళియుబర్వెగడుమోరలెత్తి - తూ
లుచుబశువులుదొరలంగజొచ్చె - నింద్రచాపములుఖండించుచాపము
లు - చంద్రార్కపరివేషజాలముల్వొడిచె - మనుజేశునకునంతమం
త్రివిరోధ - మునుబ్రఘాసవిరోధమునునాపత్తి - రోధంబుబుత్రవి
రోధంబునిరప - రాధంబుబుట్టెనూరనుమారుమగె - ధరణీశునొడియు
మహోత్పాతముల్బుట్టె - బురిజనుల్వెచ్చెరిభూమికినవధి -యధియేల
[illegible] - మద్దియులదప్పనయయ్యె[illegible]బు - మొన్న

బండితునాసమున్న తిబలికె - నిన్న నుత్పాతముల్నెలకొనె నేడు - పుట్టెగోత్ర
కలహములుదమలోన - నెట్టుగానున్నదోయింక చోడనికి - సిద్ధంబుభ
క్తి విరుద్ధంబుఫలము - సిద్ధింపనోపు జేజేతనన్లు - కలహంబుగానోపు
క్రమముగానోపు - ప్రళయంబుగానోపుప్రజలకువింక - బురినున్కియి
టమీదబుద్ధిగాదనుచు - బౌరుగుళ్ళకునుతమపొంతపల్లెలకును - వారువా
రికనేగవశినొక్కనాడు - ధారుణీశ్వరుడునిద్రాసమయమున - భసితాప
లిప్తకపాలాస్థిదామ - లసితశుంభజ్జటాలంబితవిపుల - కటితటసన్నద్ధఘం
టికానికర - పటుతరధ్వానదిగ్భరితవిభ్రమము - విలసిల్లకంకాళవేషం
బుదాల్చి - కలుషోత్కటాచార్యులుకన్నులగ్రమ్మ - దసరొమ్ముమ్రోక్క
యుద్యత్త్రిశూలాగ్ర - మునమొక్కతపసియుప్పొంగుచుబాడిచె - ననుచు
నాపోవనిజాంగనమేలు - కనిబిట్టులుకినలుగడలువీక్షించి - గగుర్పాటు
చుచుమేకొగంపింపమనసు - బెగడచిత్తంబునభీతిల్లుసతికి - నలుగుచుగల
జెప్పినంతలోపలను - కలయునిక్కలమైనకరణివర్తిల్లె - మూడుకన్ను
లవానిముమ్మొనయులుగు - పోడిగాకలలోనపాలయునంతటన - ము
మ్మొనల్గాడెరొమ్మునజిత్రమనగ - ముమ్మొనవుండురొమ్మునబుట్టెనట్టి
వుండుగన్గొనిసపావుండుసజ్జ్వరి - వుండుచోడనరాధిపుండుశంకింప - నర
యంగకుష్ఠ్యార్తియనుమహావ్యాధికి - వసనజన్నలపమూడువర్తిల్లి
నట్టు - లోనరగోపగ్రంధియునుమదగ్రంధి - యునుచరిత్రగ్రంధియును
చోడనృపతి - యుదరమునబెరుగుచున్నచందమున - బొదలుచుము
మ్మొనవుండక్కజముగ - బౌద్ధులుజైనులువండితుల్ మాంత్ర - సిద్ధులు
వైద్యులుశీఘ్రంబవచ్చి - తమతమమంత్రౌషధంబులవలన - శమియింప
కున్న నుజనని మోగంబు - వైద్యులకునుమంత్రవాదులకునున - భేద్యం
బసాధ్యంబుపెనుపగుప్రణము - సిద్ధమంత్రౌషధచ్ఛేదనదహన - బద్ధక్రి
యలచేతబాయదీవ్రణము - జైనబౌద్ధులహేంద్రజాలవిద్యాపి - తానం
బులనుప్రమాతథ్యమీవ్రణము - పూనిధన్వంతరిచేనైనవుండు - మాస
దుపండితమల్లికార్జునుని - కరుణగల్గినమానుగాకదక్కనను - హరునకై
ననుమాన్పనరుదా [illegible] నంబె - దవి
లిసజ్జనవిరోధంబుమేలనుట - ధరణీశ్వరునకుభక్తవిరోధమునను - హరు

మహాత్వముచెల్ల మైకానబడుడు - నంచుచు దుఃఖంబుజెందుచునాత్మ
గుందుచుమదవమునఁగోపంబునుడిగి - ధరణీశ్వరుఁడుఁ తమతరతరంబునను -
హాపునిభక్తులెకానియన్యులులేరు-కనియువినియునెఱుఁగనిబౌద్ధమతము- త
నకుఁబ్రాప్తంబవ్యర్థకర్మేతరంబు- వేదబాహ్యముముక్తివిముఖంబుశూన్య
వాదంబగునుబౌద్ధవాదంబనంగ - పాపంబుదుర్బోధపాలైతినింక - నేపా
రదొలుమేననెంతవారికిని - దొడఁగిచేసితిఁశివద్రోహంబుగలదు - గడవ
దుఃత్రుంచునీగండంబుగాన - నడరబండితమల్లికార్జునుకరుణ - వడసి
వచ్చినమేలుబ్రతికినమేలు - పండితారాధ్యులపాదాబ్జములకు - మండ
లంబెల్లసమర్పణజేసి - నెండిశిష్యుండ నైవిహరింతుతోడి - తెందుమ్రొ
క్కుండుబ్రార్థించుపుండుపోవు - డనవుడుమంత్రులు నాప్తులుబుధులు
జనిపండితయగారిచరణాబ్జములకు - చక్కజాలిమ్రొక్కిస్వామికృపాత్మ
దిక్కుదెసయునీవదేవచోడండు - కడుశివద్రోహిదుష్కర్మపాతకుఁడు -
జడుఁడుమదాంధుఁడుసర్వాపరాధి - పిరుదుసొచ్చిసఁగాచుబిరుదుసొచ్చి
యును - మరువంగబాడియేమహానియ్యకీర్తి - దర్పమణగిరాజుతనమే
లురాస్త్ర - మర్పించిశిష్యుడైయట్లబ్రతుకంగ - గలనాడుమీరట్లగైకొ
నిమమ్ము - దలపవేకృపఁబ్రాణదానంబుసేయ - పేకావవేఁబ్రోవవేకరు
ణింప - వేకృపామతిఁజూడవేయయ్యయనుచు - నరగొరలేకసాష్టాంగు
లైమ్రొక్క - మరియంతపండితమల్లికార్జునుఁడు - చోడదూతలతోడ
గూడభాషింప - గూడుసేయాలింపగూడునేయట్టి - యవనీశుగూడునే
యాత్మఁదలంప - శివశివప్రాణేశ చెన్నయ్యదేవ - భ్రాజిల్లశ్రుతిమహారా
జాయయనిన - రాజమహారాజరాజాధిరాజ - రాజశిఖరిరాజరాజపండి
తుడ - రాజవువేల్పవురతిసీవమైన - రాజిచ్చునసరాజరాజెసీవీక - జ
డులకైవడిబురాశాసాగరమున - బడునెమహాదానిభవదీయ్యభటుఁడు -
కోయిలమతిదప్పికూయునేభ్రమసి - రాయంచతృషకొండిత్రావునేవ్రం
డు - ఖగపతిదెసజెక్కిరచుసేయరలు - మృగపతియాకొనిమేయునేపొల్లు
మదమరిధృతిమాలిమదగజేంద్రంబు - కొదమరిపందిచన్గుడుచునేదేవ
మదనారియనియునీపదభక్తియుక్తు - నుదరార్థమెంతయునొరులకుసిగ్గు
పరుషంగబాడియెహారహరయనుచు - విడిపించుడన్యాయనిష్ఠురోక్తము

ల - దన్యాపదేశమునాలించిదూత - లన్యాయవర్తులకల్పభాగ్యులకు భర్తులకృపయెట్లుబడయంగవచ్చు - వ్యక్తమిట్టిదయనివాశేగినంత -నొదవుచునొకనాటికొకనాడుపుండు - వొదవుచురంధ్రములోవ్వుచుచుట్లు-సెలయుచు[?]జేవులుజెదరుచుమురికి - వలుచుచువాచుచు[?]వయ్యుచుగూడ - [?]గుల్లిచుగదలుచుగూలుచునూవుల - లొల్లనయూచుచునూడుచురసిక - జిలజలనెత్తుటజీముగారుచును - విలివిలియనజచ్చివిడిలిచూపరుకు - నేనంగదోవంగనిదియెంతపెద్ద - శైవాపరాధికిసర్వపాపునకు - ఘనశివద్రోహికిఖలునకుదనకు - ననుచునంతకుపురికరిగెచోడండు - నంతరాజ్యార్థమైయనిబోరియతని - సంతానమెల్లసీస్సంతానమయ్యె - బాడయ్యెభామియుబండితవిభుని - యీడితశాపమహిష్ఠతజేసి * యంతని

—*( గణమాలిక. )*—

క్కడమల్లికార్జునారాధ్యు - లెంతయురయమునవేగుచునున్న - బౌద్ధునిసమముగాబ్రతిమైనతప్పు - బౌద్ధునాచేముట్టబరపినతప్పు - హరదూషణంబుసేయగవిన్నతప్పు - హరగణంబులబర్వసందున్నతప్పు - నాపరసమయంబులణపనితప్పు - పాపిచోడనితోడబలికినతప్పు - జగతీశ్వరునిజూడసైచినతప్పు - మొగినదీక్షితులుదన్నుమ్రొక్కినతప్పు - పాయమవేరొండుభంగులననుచు - వేయుభంగులనింతవేడుకదనర - సన్నుతగణనామసంకీర్తనంబు - చెన్నారవాయారసేయంగదలచి - యాద్యర్థకృత్తగణసహస్రనామములు - హృద్యంబుగాబఠియించెనెట్లనిన * శ్రీనందిశివకరశ్రీనందికేశ్వ - రానందసందినాధాక్షయవిజయ - భద్రవీరకవీరభద్రభద్రాక్ష - భద్రమహాకాళ పంచాక్షరత్రి - యక్షరద్వ్యక్షరేకాక్షరాక్షరష - డక్షరోగ్రాక్షధూమాక్షానలాక్ష - వికలాక్షవిమలాక్షవిశ్వవిశ్వాక్ష - వికటాంగగగనాంగవిజయజయాభ్ర- వర్ణమహాభైరవశ్రేష్ఠసూర్య - వర్ణమహాజ్వరజ్వారసోమవర్ణ-నిష్కంపనీరదనిస్వననిత్య - నిష్కలపుష్కలనిశ్శంకకాల - రూపనిరూపవిరూపాక్షవిశ్వ - రూపసుందరశాంతరూపోగ్రరూప - కోకిలకందకికుందకికుముద - కాకపాదాపాదకటకాహికటక - పింగళానక్షరపింగళమధుప

పింగళాంబకమధుపింగళకటక-విజయసద్యోజాతవిష్టంభశిష్ట-నిజబలశ్రీకం
ఠనీలసమస్త - భూతజృంభణసూర్యపాతనసోమ - పాతనసురగిరిపాతన
వింధ్య - పాతనాంగారకభక్షణసర్వ - పాతనసర్వకంపనసర్వదాహ -
చండకీర్తీశానచండీశచండ - దండపాణికపాలధరహరిహరమ - హాకా
యనందిమహాకాళపుండ -. రీకఘుఘ్ఘురభృంగిరిటమృత్యుహరణ - స
హానేశదీర్ఘహ్రస్వస్థూలసూక్ష్మ - గుహాకాద్రకూశ్మాండగోపతిజటిల
దండిరుండాభరణాండాభరణశి - ఖండముండధరనికర్షణలంబ - కర్ణ
ఘంటాకర్ణగజకర్ణశంఖ - కర్ణద్వికర్ణత్రికర్ణ
ర్ణసహస్ర - కర్ణవికర్ణగోకర్ణవరాహ - కర్ణసంక
ర్షణోత్కర్షణవిపుల - పర్వతాభరణదర్పకఠోరవచన - సర్వజ్ఞసర్వా
త్మసర్వసర్వజ్ఞ - కరిముఖనరముఖకపిముఖాహిముఖ - శరభముఖా
ముఖోష్ట్రముఖశార్దూల - ముఖసింహముఖమేషముఖగోముఖాశ్వ
ముఖపంచముఖచతుర్ముఖవిముఖాష్ట - ముఖనవముఖదశముఖషణ్ముఖ
ద్వి - ముఖసహస్రముఖత్రిముఖవరాహముఖ - దక్షభాస్వరవిషభక్ష
ణబ్రహ్మ - భక్షణశతసహస్రాక్షపంచాక్ష - భద్రకర్ణాశనిభాస్కరపూ
ర్ణ - భద్రాసఖలితమహాభద్రగుహేశ్వ - రాంతకాంతకపుష్పదంత
భుగ్వజ్ర - దంతవియోక్త్రసితగ్రీవవృషభ - సాంబరచంద్రగంగాంబుశే
ఖరది - గంబరడమరుగహస్తసుహోత్ర - దర్దురరేణుకదారుక
కాల - మర్దనదక్షవిమర్దనత్ర్యంబ - కార్ధనారీశ్వరహాటకేశ్వర
ఘ - టార్ధదేహార్ధవక్త్రార్ధనాసార్ధ - ఫణిభూషణక్షేత్రపాలక
పాల - మణివిభూషణవిప్రమాలికపాలి - శంకరోంకారవషట్కారకా
ల - కంకాళధరవజ్రకాయసుషేణ - ధూమాంగధూమకేతువ్యాఘ్రవ
క్త్ర - వామదేవాఘోర్ధ్వవాహనరాహ - సంతానకప్రపంచాంతకత్రి
భువ - నాంతకదైత్యాంతకాసితకాయ - శూలాయుధసుమణిసుగతిసు
పాణి - కోలాహలోత్తుంగగురులఘువజ్ర - పాణిసుదర్శనపాణిపినాక
పాణిమహాకేశభగ్నసుకేశ - భవమహావ్రతవిషబలమహాబాహు - శి
వమేఘవాహనశ్వేతసర్వాంగ - కామాంగదహనఝుంకారమహేంద్ర-
శ్రీమదమనసురార్చితనాగదంత- బభ్రుమృత్యుంజయోభయశిరోనిర్మ. -

లాభ్రకాయాతికాయాప్రతిమప్ర - కంపనోన్నతభానుకంపనసోమ - కంపనసంవర్తకశ్రీధగప్ర -కాండశతోదరచండోదరప్ర - కుంభకుండోదరాఘోరకుంభోద - రాంభోదనాదవృషాంకకంటకని - కుంభమహీధరకులిశధరేందు - ఖేటకనక్షత్రకృంతనసూర్య - ఖేటకహరిజటాకేసరసూర్య - పేషణబ్రహ్మాండపేషణసోమ - పేషణసూత్రనిపీడనాందోళ - కామేఘలాలాసురాంతకశూలి - సోమదత్తస్వయంజ్యోతిరంగాట్ట - హాసభస్మేశ్వరహాలాహలాతి - హాసగుహావాసహరమహామాయ - దిగ్వాహనాశనద్వీపనిర్దళన - దిగ్వారణాహారదిక్పాలఖాది సాగరాపోశనసంహారకాల - సాగరధ్యానాప్తనాగాంగుళీయ్య - శశిధరతత్పురుషస్థాణురుద్ర - పశుపతిఖట్వాంగపాణికపర్ది - గరుడపక్షచ్ఛేదకాలాపహారణ - గిరికందుకాటనక్షితివియత్తాల - విష్ణుకంకాళాంకవిధిశిరశ్ఛత్ర - విష్ణునేత్రాదానవిధితిరస్కరణ - బడబాగ్నితిలకైకపాదపంచశిఖ - బడబానలాననప్రళయాగ్నినేత్ర - కులగిరిశాసనకర్మాహిశటన - విలయాగ్నిఖేలనవిద్యుత్ప్రభావ - లింగాక్షభయదమాతంగమహార - ధాంగదకాలరుద్రాక్షపాదోర్ధ్వ - గాదివరాహదంష్ట్రాంకితపదన- బాదరాయణభుజోత్పాటనసింహ- చర్మవసనయజ్ఞచర్మాసనేభచర్మచేలవ్యాఘ్రచర్మోత్తరీయ - హరిరథాయాథచక్రాపహాక్షీర-శరనిధిపానవిష్వక్సేనహరణ - భీమకాయాకాయపృథుభగదత్త - సోమదత్తాభీలసుచరిత్రమేఘ - ముఖపాదముఖకుక్షిముఖబాహుముఖను - ముఖజానుముఖవిశ్వముఖమహాభీల - బహువక్త్రబహునేత్రబహుతాలుజిహ్వా- బహుకర్ణబహువర్ణబహుతాలులోల - జంఘమధరమహాజంఘోరుతాళ - జంఘధరప్రదస్వచ్ఛందచారు - దంతాభ్రతాళతత్వమతికుతార- దంతమహాక్షపతాకప్రచండ-బలదీర్ఘదంష్ట్రసుబాహుపాతాళ- తలవాసిహ్రస్వకంధరదీర్ఘలోచ - నోక్షవాహనసహస్రోదరవర్త - లాక్షప్రియపరక్తాక్షవర్ణాక్ష - కాలకరమయూరకంఠోర్ధ్వబాహులోలాక్షలంబాక్షనీలాంబరాగ్ని - కుండలక్రతుహారాజాండబాహుగ్ర - కుండలానంగసుఘోణాద్రికుండలాండఘుర్ఘరగర్గనానందనంద - పాంసురాంగాసితాంబరకుండకర్ణ -

లంబోష్ఠదీర్ఘోష్ఠలంబకర్ణప్ర - లంబలంబోదరలంబలంబాక్ష - హ
నులంబజిహ్వాలంబాననలంబ - తనులంబనాసికాదశభుజద్విభుజ - సో
మాక్షరౌద్రాక్షసూర్యాక్షసోమ - భీమాంగలలితాంగరోమాంగక
ర్ణ - సేనదుష్కర మహాసేనశాశ్వతను - ఆనంద కాలకూటాగ్నిజి
హ్వాగ్ని - కేశధూర్జటిమహాకేశత్రిజటిను - కేశోర్ధ్వకేశనాకిషశిరో
హరను - జిహ్వాద్విజిహ్వాత్రిజిహ్వాసహస్ర - జిహ్వావిద్యుజ్జిహ్వాజిహ్వా
దరోరు - జిహ్వామహాజిహ్వాసితకర్ణవహ్ని - జిహ్వానికృంతనశ్రీధరా
రాధ్య - లంబకంధరమహాలయమహాదంష్ట్ర - లంబోష్ఠశంభుపీతాంబర
స్థూల - విగ్రహప్రబలకంబుగ్రీవధూమ - విగ్రహవికటసింహగ్రీవదీర్ఘ
బాహుద్విబాహుత్రిబాహుసహస్ర - బాహుమహాబాహు
పాదబాహూరు - బాహూరుపాదోరుబాహుముఖోర్ధ్వ - బాహుప్ర
ముఖమహాప్రమథగణములు - భువనేశ్వరాదివిభూతికపాలి - భవభూ
తికరభూతిపాలనచక్ర - ధరమహాబలదంతదంష్ట్రప్రచండ-ధరదహనక్రూ
రదంష్ట్రోర్ధ్వబాహు - వేదపారగమేఘనాదత్రికలను - నాదకపర్దిధ
నంజయశ్వేత - భద్రాసిలాశనభవకాలకాల - రుద్రశాశ్వతనీలరుద్రపి
నాకి - సర్వజ్ఞదీర్ఘహ్రస్వస్థూల రుద్ర - సర్వేశ సుఖఖర
జ్వాలనాక్ష మేఘ - వాహనక్రోధీశ వటరుద్రహరవి-
వాహనాసిత ధూమ్రవర్ణవిధీశ - కలవికరణ కాల కాలమహేశ -
బలవికరణరుద్రప్రమథన జ్యేష్ఠ - సర్వభూతదమనచరమహాతేజ - స
ర్వమనోన్మనస్థాణుశరీర - పూరకజ్యోతిరఘోరభర్గైక - వీరేశ్వరా
నేకవీరవిశ్వేశ - పింగేక్షణాంతరిక్షాంగవిద్యేశ - పింగళానంతమాతం
గత్రిదంష్ట్ర - వృషభగణప్రియవిభువిరూపాక్ష - విషధరాక్షయరుద్ర
విద్యాధరేశ - హారరత్నకరమారహరణత్రినేత్ర - హరిహరబభ్రుభక్ష
యాంతకదుఃఖ - కరభయానకవిచక్షణకరశూల - ధరసదంబరజటా
ధరగణాధ్యక్ష - ధాతృత్రిదశవందితప్రమర్దకవి - ధాతృగ్రసనపరం
ధాతృపంచశిఖ - యామ్యసూత్రస్థితక్షణాతిభవేశ - సౌమ్యదేహో
ర్ధ్వకేశజ్వాలనప్ర - కాశబస్తాంతకకాలలోహితను - కేశరుద్రాగ్ని
పలితాశనరుద్ర - భీమభవోద్భవవిష్ణుమహేశబుద్ధి - [illegible]దేవప్రభుస్వామి

సర్వాత్మ - సహానేశగౌరీశశంభుగిరీశ - గుహారౌద్రపరమాత్మగోపతి
ప్రబల - వజ్రదంత్రాస్యయవాయువేగోగ్ర - వజ్రదంతాసితవర్ణావి
మోక్తృ - బడబాముఖానాద్యపావకశ్రేష్ఠ - మృడపరాపరకళామే
యనివృత్తి - పాశహస్తలఘురూపధరమృత్యుంజ - యేశానరుద్రఫణీం
ద్రగణేంద్ర - బకరుద్రబోధకప్రళయాగ్నిరుద్ర - వికరణార్చితభైరవి
టరుద్రమృత్యు - హరతారరుద్రవిశ్వాధికరుద్ర - శరభరుద్రమహా
వృషభరుద్రశబర - రుద్రమహాకాళరుద్రసంహార - రుద్రమహానా
ట్యరుద్రకిరాత - రుద్రార్ధనారీశరుద్రమహోగ్ర - రుద్రమృత్యుంజ
యరుద్రవీరాఖ్య - రుద్రసదాశివరుద్రవిజ్ఞాన - రుద్రజయవిజయరు
ద్రకర్మాఖ్య - రుద్రమహాశివరుద్రైకపాద - రుద్రాదిరుద్రాదిరుద్రగణ
ములు - శ్రీమద్దమనవేదశిఖిజటామాలి - సోమసర్వేశ్వరశూలిసహి
ష్ణు - ముండిజైగీషవ్యదండిలాంగులిసి - ఖండిసుధీవాహకంకసుహో
త్ర - దారుకోగ్రత్రిసుధారలోకాక్షి - చారుహాసలకులీశ్వరగుహావా
స - గోకర్ణముఖయుగాలోకగౌతముమ - హాకాయఋషభమహాకా
యులనగ - ననదృశమహిమయోగాచార్యులిట్లు - నెనగునయ్యిరువ
దియెనమండ్రుగురువు - లలరుధర్మాచార్యులనువారిశిష్యు - లెలమినై
నూటపన్నిద్దరుభువిని - తిరునీలకంఠుండుతిరునీలనక్క - తిరుమూలదే
వుండుతిరునాళ్లప్రోవ - మానకంజారుండుమంగయక్కరసి-యానయనా
రుమొన్నయధరుపిళ్ల - నంగరోహిణిపిళ్లనయనారనంగ - సంగచండుం
డుపూసలనాయనారు - పరమనాచియురుదీపదకళియారు - కరిగణనా
థుండుకలికామదేవు - డమరనీతియిరువదాండారిమురుఘు - నమినంది
యేణాధినాథుండుసాంఖ్య - తొండభూపతిచిరుత్తొణతిరుకురుపి - తాం
డండునంబిచిత్తొండండనంగ - చీరాలదేవుండుచేదిరాజయ్య - గారికా
శివ్వయేకాసిసోమాసి- మారుండువీరపెర్మాణిదేవుండు - వీరచోడడుజెడ
యూరిరిత్తాండి- మెల్పరచెలదివాగీశనయనారు - కొల్పురియలయదంగు
ళినాయనారు-చిరుపులియూరులచ్చిరినయనారు - మిరుమిండనాట్యనిమి
త్తండియారు - కరికంబయరిపాలుకడమలనంబి - కరియంబగుగ్గులుకళి
యనైనారు - కన్నప్పత్తాపసికరుమానిచోళు - చెన్నయ్యచోడండుచేర

మరాజు - డిడుగుడిమారయ్యనిడుమారదేవు - డడిభర్తమేఘమూ
ర్తియరవత్తుమువురు - హొన్నయ్యపాండ్యనాయుండుగుడ్డవ్వ - కిన్న
రబ్రహ్మయ్యకేతయ్యగారు - బీరయ్యహండయ్యగారుబిబ్బయ్య - గా
రుఘనాగయ్యగారునాగయ్య - గారుకాళవఫణిహారిసోమన్న - గారుచి
క్కలిగెనాగయసేననాథ - దేవరబాచయ్యపూవులబాచి - దేవండుబా
చలదేవిషోడశులు - వీరఘంటయమైలిగారిదేవయ్య - గారుబొప్పలదేవి
గామలదేవి - గారుచోడవ్వసింగయ్యబీచయ్య - గారుమాదేవయ్యగార
న్ను బెరసి- దసగణసింగణయ్యదశగణంబులును - బసవరాజయ్యప్రభాతగణ
ములు - సింగిదేవుడుబ్రహ్మిసెట్టిసాత్వికి - సంగమైలిగిరిజసంగయ్యదేవ
రసుగారుకన్నబరసుఫణిహారి - బసవయ్యయుప్పలబాచిదేవుండు - దేవుం
డునొహిళదేవయ్యబొప్పి - దేవియుగామలదేవితేరసులు - శ్రీపతిపం
డితుల్సింధుబల్లహుడు - ధూపదమాచయ్యధూర్జటికేశి - మడివా
లుమాచయ్యమాదిరాజయ్య-బడవరబ్రహ్మయ్యబాచిరాజయ్య - కిన్నెర
బ్రహ్మయ్యకేశిరాజయ్య - కన్నడబ్రహ్మయ్యకాశిరాజయ్య - మోళిగ
మారయ్యముసిడిచౌడయ్య - శూలదబ్రహ్మయ్యసురియచౌడయ్య- కలి
కేతబ్రహ్మయ్యకక్కయ్యగారు - తెలగేసుమసణయ్య తెలుఁగుజొమ్మయ్య
యుత్తమాంగదకేశిహొన్నయ్యగండ - గత్తెమాచయ్యకాలాగ్నిరుద్రు
డుదరదరామయ్యహొన్నబ్రహ్మయ్య - కదిరెరేమయమహాకాళయ్యబి
బ్బ - బాచయ్యసదరదనాచయ్యవీర - నాచయ్యయడపదరేచయ్యగార
లల్లయ్యమధుపయ్య యల్లబల్లేసు - మల్లయ్యగోడల మల్లయ్యగారు -
నిజలింగచిక్కయ్యనిర్లజ్జశాంతి - నిజభావనుడుసిత్యనేవదమైలి - దసర
య్యదేడరదాసిగజ్జేసు - మసనయ్యగారుసమాత్యమల్లేసు - జెట్టిమార
యగాళభట్టారకుండు - పిట్టవ్వగోవిందభట్టారకుండు - శంకరదాసయ్య
శ్వపచయ్యసుంకి - బంకయ్యమొరటదవంకిదేవయ్య - యముఁగిదేవుండు
చిక్కముగిదేవుండు - నమరగుండమమల్లికార్జునయ్యయును - దార
య్యభోగయ్యదాసకేసయ్య - మారగాళుండునుమలయరాజయ్య - పం
చాగ్నిసూర్యుడుద్భటుడుసన్యాసి - మంచయ్యమల్లబ్రహ్మయవెల్లగొండ
మహాదేవ[illegible]దేవి[illegible]మహాదేవి[illegible]మాచ్యబల్లివి - వే

మనారాధ్యులువిజయాపురంబు - సోమిదేవుడుచిక్కసోమిదేవుండు - మాదరదూడయ్యమద్దయ్యగారు - కేదారమాచయ్యకెంభావిభోగి - దేవండురేవణదేవండుమారు - జావదేవరవీరచాకిదేవయ్య - చేటలవేమయ్యసిద్ధబుద్ధయలు - హాటకేశ్వరునిమల్లయ్యయునమృత - నాథునియప్పయ్యనాగయ్యయుకుమ-నాథుతిప్పయకల్లినాథుభీమయ్య- వీరకల్లయ్యనిర్వివసదనాకయ్య- యుకులింగపెద్దయ్యయునుగొంగుదొరతి- యాకయ్యశివరాత్రియప్పదేవయ్య - చాకలదేవియునత్తెక్కచాకి - దేవయ్యరేమయ్యదేవయ్యపోతి - దేవండుపెద్దిగదేవండువీర - కల్లయ్యవీరనాగయ్య జువుటూరి - మల్లిదేవునవీరమాచయ్యసకల - దేవయ్యయునుశివదేవయ్యరామి - దేవంనచక్రవర్తియుపొట్లచెరువు - వీరచోడవదేవివీరసంగయ్య - వీరబ్రహ్మయయునువీరదేవయ్య - బాపూరిబ్రహ్మయ్యభానుదేవుంను - కోవూరిబ్రహ్మయ్యగొడగూచియన్న - బ్రహ్మయ్యకరవూరబ్రహ్మయ్యపుంగ్ర - బ్రహయ్యసగరదబ్రహ్మయ్యశూలి - బ్రహ్మయ్యరాజనబ్రహ్మయ్యమోాలె - బ్రహ్మయ్యరక్కసబ్రహ్మయ్యముండు- బ్రహ్మయ్యయునుమిండబ్రహ్మయ్యబాల - బ్రహ్మయ్యసాహిత్యబ్రహ్మయ్యగారు - నులకచందయచిప్పనూతులప్పయ్య - బలదేవడుగుమారపాలఘూర్జరుడు - మేధావిరుద్రుంనుమిండసంగయ్య - నైధునరామయ్యమగతిలకవ్వ - యంగరాయండురాజార్ధరాయండు - శృంగిచొప్పయగారుశివకుమారుండు - నోహ్మిళయ్యయుహలాయుధుడునురామి - సాహిణివెకగొండచక్రవర్తియును - పల్లవరాయండుపరమహంసుండు - గొల్లవరాయండుగురుకుండదేవు - డల్లమదేవుండుహావినహాల - కల్లిదేవయ్యభాస్కరరేడునిల్ల - హాళబ్రహ్మయయు నైదక్కమారన్న - కాళెమరుసుగారుగణదాసువీర - యాదయ్యబీరయ్యపాదాలయక్క - జోదులమాయణ్ణసూళాయిత్రయ్య - యురగరాయండుసద్యోజాతదేవు - డరియమరాజయ్యహంపయ్యగారు - వేగిసంగయగారువీరప్రోలయ్య - చాగుబొల్లయ్యప్రసాదిబంకయ్య - యేలేసుకేతయ్యయింగడెసోమన్న - చాళుక్యభీమయ్యచట్టయ్యగారు - కొట్టరుబాచయ్యగురువుభకయ్య - రెట్టిణిపెదయ్యశివముద్దుమాగు - సంగయ్య

షనిపురశంకరదేవు - డింగుళిగెవై జన్నగంగాపురంబు - బసవయ్యఫణిహా
రిబసవయ్య చెన్న - బసవయ్యయవగళబసవయ్యగంగ - మల్లయ్యశిఖ
శేసుమల్లయ్యవీర - బల్లహుండనుతాడిపర్తిబొల్లయ్య - శ్రీకోటిప
ల్లెయ్యశిద్ధరామయ్య - యేకాంతరామయ్యయిండెశాంతయ్య - సరవూ
రబంకయ్యశంకరశెట్టి- బెరళదమారయ్యబెట్టదదేవ - రసునిర్ధనయ్యనిరా
శదేవయ్య- హసియమస్తకదమాచయ్యప్రసాది- దాసయ్యకెరవూరిదా
సయ్యయజ్జ - దాసయ్యనింబాళదగణేశ్వరుండు - యాణవిచందయ్య
యాణ్మదేవుండు - ద్రోణేసుమల్లయ్యరుద్రియన్నయ్య - కొలిపాకమా
రయ్యగొణిజమారయ్య - బలగరమారయ్యబైచలమాయి - దేవయ్య
యనుజగద్దేవయభాను - దేవయ్యబహుబలదేవయ్యగారు - గుడ్డయ్య
మారయ్యగోయిదేవయ్య - నెడ్డుసోమయనిలివేగిబైచయ్య - రాసమ
ల్లయచిక్క-రాచమల్లయ్య - వైచిదేవుడనిమిషయ్యనత్సేశు - సోమ
యబల్లేసుసోమయ్యసుంకి - సోమయ్యయాచారభీమయ్యగారు - ధవళ
య్యగారుబొంతాదేవిగారు - ధవళేసునామయ్యదండిప్రసన్న - బసవ
య్యకంకాళబసవయ్యచిక్క - లసదదేవయజట్టిలట్టసోమన్న- శివలెంక
మంచయ్యచిగురుచందయ్య - శివరాత్రిసంగయ్యశ్రీమారసాని - శివ్వ
య్యధర్మయ్యశ్వేతయ్యవైజ - కవ్వబొల్లవ్వరెబ్బవ్వరేకవ్వ - యమ్మ
వ్వయరసవ్వయాదవ్వవీర - రెమ్మవ్వకమలవ్వనిమ్మవ్వగారు - లాదిగా
గగణసహస్రనామమ్ము - లాదరణీయంబులై యొప్పునిట్లు - సలితద్గణ
సహస్రనామస్తవంబు - వెలయపఠించినవినినవ్రాసినను - విరచించిన
నుభక్తివిస్ఫూర్తినొసగు - దొరుకునుశుభములుదురితముల్దొలుగు -
హరుప్రసిద్ధప్రసాదానందమలరు - చిరమనోరథములుసిద్ధించుమరియు-
దుస్స్వప్నదుష్కర్మదుశ్శకునాదు - లస్వప్నసర్వగ్రహాదిదోషములు-జ్వ
లనాపమృత్యుతస్కరవృశ్చికాహి - జలమృగరోగరాక్షసవిషభూత -
పవనమహోల్కావిపత్తుదారిద్ర్య-పవిరాజభయముఖ్యబాధలణంగు - న
ర్థార్థులిస్తవంబర్థిపఠింప - నర్థసామర్థ్యసమగ్రతదనరు - పు
త్రార్థులీనామములుబఠియింప - పుత్రాభిజననవిభూతివహించు-శత్రుక్ష
యార్థులీస్తవముబఠింప - శత్రుక్షయైశ్వర్యశక్తివహించు - భుక్తిచ్ఛ

నీనామములుబఠియింప - భుక్తియునభిమతభోగముల్ గలుగు - ముక్తి
చ్ఛనీనామములుబఠియింప - ముక్తులునాల్గునుముదమునగల్గు - భక్తి
చ్ఛనీనామపఠనంబుసేయ - భక్తిసౌభాగ్యసంపదసమకూరు - నొందఁది
గంతసంయుతమహాకీర్తి - చెందుమంగళమహాశ్రీధనస్ఫూర్తి - యం
చునూతనసృష్టినభినవంబుగన - మంచితభక్తిగణావళిబొగడె - నవ్యగ
ణసహస్రనామస్తవంబు - భవ్యపంచాక్షరీపఠనప్రయుక్తి - జఠియించు
చుజననిజఠరకఠోర - పిఠరాపహరణకర్మఠుడువండితుఁడు - నంతనీక్రియ
నమరారామమునకు - సంతోషమునభక్తసహితుడై యేగి - యా
సక్తుడై యమరారామపురిని - వాసునియమరేశువాసవాధీశు - నమరే
శ్వరాష్టకంబందగీర్తించి - కమనీయతద్దీర్ఘికామధ్యమునను - గణకూ
ట ము స న స ం ఖ్యా త త ద్భ క్త - గ ణ ము ల వ ర్గో ల గ ం
బుగానునిచి - నదిదక్షిణార్ధ మా న ర ప తి భూ మి - - నది
యుత్తరార్ధమీనరపతిభూమి - వెడలితిమటుగాన వెలనాటిసీమ - బ
డయుదునింకనంబకములీక్షణము - యట్టిదకాదేమాయాదిప్రతిజ్ఞ - యి
ట్టునుగాక వాడంతకుగూడు - నంతకుబడయమేమన్నారమట్టి - యంతకు
గూడువాడింతకుననుచు - పోరిబోరిగూడవిభూతివీక్ష్యమ్ము - లరుదొం
దభక్తగణావలికిచ్చు - నంతలోననఫణిహారియాద్రోహి - నంతకుప్రో
లికిననిచియేతెంచి - నలిభక్తతతికివిన్నపమాచరింప - నలరుచుసమ
లోకారాధ్యమూర్తి - యతులశాపానుగ్రహసమగ్రకీర్తి - యతిచ
క్రవర్తినిరస్తాఖిలార్తి - పండితేంద్రుండుశంభన్మహాభక్త - మంజలి
కంతంతమహిజాగ్రమొక్కి - ప్రమథాదినూతనప్రాక్తనభక్త - సము
దాయశ్రీపాదజలజాత్ముడగుచు - విగతనేత్రద్వారవినిహితావృతము -
లగుప్రసాదప్రసూనాంబరావలులు - పుష్పించునంతనపురహరుకరుణ -
నొప్పారనుదయించెనూర్ధ్వనేత్రములు - బండకువందున్నపద్మరాగ
ములు - బండరుదెరుచుశుభ్రాజిల్లునట్లు -తరుణతరద్యుతుల్దళుకొత్తసూ
ర్య - కిరణవిస్ఫురణంబుగీక్ష్వరచుచును - పండితుకన్నులోపద్మరాగము
లో - పుండరీకంబులోపూర్ణేందుకళలో-ముక్తిగోళకములో మోదాంకు
రములో  యున్నృతపించను

లోదయాకరండములో - సుమహద్గణస్థానసుకరదీపములో - యుద
యార్కశకలంబులో మణిస్మృతులో- సదమలజ్ఞానబీజములోయనంగ- నె
ప్పెవెండియుభక్తియువతినేత్రముల - యొప్పలీకన్నులయొప్పలనంగ -
ధరవీరభక్తిచింతామణిపసులు - బోరిబోరిసినేత్రములరుచులసగ - దృ
ష్టసద్గురుదయాదీపితజ్ఞాన - దృష్టులీకన్నులదృష్టులనంగ - సొంపారనిజ
హృదీశునిపదాబ్జముల - కెంపులీకన్నులకెంపులనంగ - నలిబ్రాణలిం
గాఘ్రిసఖదర్పణముల- తెలుపులీకన్నులతెలుపులనంగ - నిద్దంబులైమ
హానియ్యంబులుల్ల - సద్దయాన్వితములై శాంతిరూపంబు - లైకళాయు
క్తంబులైసుధామయము - లైకమనీయ్యంబులైలసత్కాంతి - మంతం
బులై యసమానంబులై ని - తాంతంబులై వినూతనములై విబుధ - స
న్నుతములునయ్యజనునెఢనిడుద - కన్నులులోకవిఖ్యాతమైవెలుగ - హ
రమూర్తిగురుమూర్తియగుపండితయ్య - కరమొప్పనిడుదలౌకన్నులు
సూచి - పురజనుల్ బుధులునద్భుతముగజూడ - వరభక్తదిగ్గజావలిమిన్న
దాక - నారూఢమతిమల్లికార్జునపండి- తారాధ్యులంతనత్యంతనితాం
త - చాపతరోర్ధ్వాలోచనములువరుస - తోరుతరస్వయంజ్యోతిరుద్దీప్త
విదితాంగుడగుశంభువికసితాంబకస - ముదితంబులగుగన్నుగొదములో
యనిన - భావనదివ్యతేజోవిరాజితము - లై విలసిల్లుదిగంతదీధితుల -
నెలకొనుదనయెడనిడుదకన్దోయి - నలివిచ్చివిచ్చిగణప్రదర్శనము - గా
వించుచునుభక్తగణకరుణాసు - ధావార్ధిదేలంగదనివ్రాకమరియు - న
న్యోన్యసందర్శనాన్యోన్యవంద - నాన్యోన్యభాషణులగుచుదద్భక్త
గణములయ్యెడనిడుకన్నులుసూచి - గణుతింపచిత్రంబుగాదెమున్నాది -
భవునిచేగన్నులువడసినవారు - భువిలేరెయనిననద్భుతమెట్లులనిన -
నాసరసిజనేత్రుడాదిజలంధ - రాసురుపయిబోయియనిసేయనతడు -సం
ధిల్లతనబలక్షయముగావించి- బంధించితనువియత్త్రాంతానవైవ-నెన్నబ
దాపువేలేండ్లువాపోవు - చున్నశ్రీవృషభేంద్రుడుకువల్లభుడు - వినియ
ట్లశివునకువిన్నవించుడును - జనిశూలినాతోడసమరంబుసేయ - జనుజ
లంధరసీవన[illegible]రగసీతోడ - ననికి
నాకేటికినాయుఖంబిసగ - ననుచునెజ్జైననిరాయుధుతోడ - పనిసేయుట

న్యాయమనుచుమాధుర్య - వనధిలోవామాంఘ్రివరనిజాంగుళము - ని
డిత్రిప్పనయ్యసురేంద్రునిజుట్టి - వడిదిరిగెడిజలావర్తపూరంబు -
దివిరిభాస్కరకోటిధిక్కారలీల - నవిరళ
స్ఫూర్తిచక్రాకారమగుడు - దనుజకోచక్రాయుధంబిదేయనుడు - ద
నుబట్టదగునాయుధంబయ్యెననుచు - నురువడిదనుజట్టియున్నచక్రంబు
గరమునకంఠోపకంఠంబుగాగ - బూంచియెత్తుడుదైత్యపుంగవుశిరము
దెంచెదచ్చక్రంబుదెంచుడునంత - నంధకాసురగంధసింధురాసురజ
లంధరాసురనిర్దళనుముట్టగొల్చి - ఆక్రమ్యదైత్యాపహరణార్థమన
ద్రి - విక్రముడంతనాచక్రంబువడసె - బహుదైత్యతతిజక్రబలమున
నోడిచి - మహిజరించుచుతుపుమతమునజేసి - యేచివిష్ణుండుదధీచిపైన
లిగి - వైచుడువడివిగ్రవరచక్రమవుడ - తుత్తుమురుగనుదైత్యులువి
జృంభింప - జిత్తజాంతకునిభజంచిచక్రంబు - వడయుదుదోల్లింటిపగిది
నననుచు - జడజాంబకుండులసద్భక్తియుక్తి - దప్పకవేయేసితామరవి
రుల - నెప్పుడుగొనివచ్చియేకాగ్రబుద్ధి - నమితసద్భక్తిపడతురీభావ
నమునరుద్రసహస్రనామంబులందు - నొక్కొకదివ్యనామోచ్చారణ
మున - నొక్కొక్కపద్మంబునుగ్రుబూజింప - సరియదాస్యాత్తదసంభ
వంబనగ - ధర్రశుతులన్నేత్రముత్పాట్యనానంత - నొక్కనాడొండుదక్కు
వపడగ - గ్రక్కునదననేత్రకమలమర్పించి - చక్రంబుగన్నునీశ్వరుచేత
భక్తి - విక్రమంబేర్పడవిష్ణుండువడయ - హరియదేపడయువాడర్పిం
చికన్ను - హరుడిచ్చువాడదేయందెంతయరిది - వారకయిమ్మాటువరు
సలవీర - ఘోరతపంబుగైకొనియిాశుగొల్చి - శ్రుతిసర్వతోక్షిశిరో
ముఖంబనగ - శ్రుతివిశ్వతశ్చక్షురుతయనలోచ - నాంగీకరణసమస్తాం
గుచేహరిదో - డంగికన్నొకటిబడయునదియట్టె - కడపటనొడలెల్లకన్ను
లుగాగ - బడయడెముక్కన్నుబడయుటయంటె - బడయుటయిాశుం
డుబత్యక్షమైన - గడపటనదిగాదుకాదనికాళి - దాసికన్నవబూన్చితనర
నేత్రముల - రాసులువడసెనాక్రమమెట్టులనిన - భట్టభల్లటభానుభవ
భూతిరుద్ర - భట్టగోపాలకభట్టసుబింద - [illegible]
[illegible]

రరుచివరభట్టమాఘు - జయకీర్తికవిరాజశాకటాయనవి - జయదత్త
కౌమారసర్గకోత్ప్రేక్ష - వల్లభాదికవీంద్రవరకవితాస - ముల్లాసరచ
నాసమున్నతిమిగులు - పాలితశాబ్దికుల్ బాణమయూర- కాళిదాసులు
తమకవితావిశేష - ములకుమాత్సర్యముల్ బుట్టుడులోక - ములుజా
డవిద్వత్తములుమెచ్చదొల్త - జనిమయూరుడుసూర్యశతకంబుజెప్ప -
నినుడు ప్రత్యక్షమైయిడనీమపూర్వ - కర్మంబుకుష్ఠరోగముశూలిదక్క
నిర్మూలముగజేయనేరరట్లయ్యు - నొక్కించతనాదీప్తినెసగెదనదియు -
గ్రక్కునవెలి కుష్ఠగప్పిపోవంగ - నంతస్థమగుకుష్ఠహరునిచేగాని -
యింతయుజడదట్టులీశునుతింపు - తడయకిరోగంబుతనకయ్యెగృతుల -
నొడువుమార్తాండభానోఃకుష్ఠయనగ - నంతదద్రోగంబుహరుపాదభ
క్తి - మంతుండనైకొల్వమానెనావుడును - రతిమయూరుడుమయూ
రస్తవమనగ - క్షితిధరాత్మజపతిగీర్తనజేసి - ధరభానుచేబోనితనలో
నికుష్ఠ - హరియింపనిదియుచోద్యమెయంచుభట్ట - బాణుండువెండి
యుభక్తిక్రియాఢ్యు - రీణుడప్పుడుదనరెండుచేతులును - కడికండలుగ
దనకట్టలక్క దునిమి- పుడమిజనంబు
ద్భుతమనిచూడ -హరుబూన్చిబాణగద్యావసానమున- చిరభక్తిశివకర
వకరయనుచు-బడసెచేతులురెండుబక్షయుటయెంత - కడదిదానను
క్కనగాళిదాసి - కన్నులురెండునక్షణమ
లంకి - పన్నగధరుపదాబ్జములకర్పించి -
ధరగాళిదాసగద్యంబునాజెప్పె- వరభక్తియుక్తినీశ్వరునిగురించి -
చ్చినకన్నులనిచ్చుటగనుట - యచ్చెరువగునమహాదానియనుచు -
నుచేసఖలలోకీశుచేకాళి - దాసినేత్రంబులరాసులువడసె - నన్నిదే
బులనెన్నిపురముల - నెన్నిగ్రామంబులనెన్నంగబడియె - నన్నిదేశ
లనన్నిపురముల - నన్నిగ్రామములజాత్యంధులందరును - కనుగు
లక్షిరోగస్థులైయున్న - జనులరండోయనిజాటంగబనిచి - తప్పుచో
నకన్నుతడికన్నుబొరలు - గప్పినకన్నుడుక్కకన్నెడ్డకన్ను - దొడ్డిగట్టి
న్ను దూలగొన్కన్ను - చెడ్డకన్నునుపూలబడ్డట్టికన్ను-మయిలకన్ను
మసనసగ [illegible] కన్ను - [illegible] కన్ను - దూ

మెడికన్నుదోలగుడుకన్ను - తీటకన్నును మరితిమి
రంపుకన్ను - గుడ్డికన్నెరకన్ను గొఱ్ఱెప్పకన్ను - బ్రొ
డ్డుకన్నును పుర్వుబోయినకన్ను - పాలగట్టినకన్ను ప్రంగుడుకన్ను - క్రా
లుకన్నునునీరుగారెడికన్ను - బొందకన్నును బొరిపొరిబొంగుకన్ను - ప్రం
దకన్నును పెక్కుమాదలకన్ను - పోటుకన్నును బొగ్గుబోయినకన్ను - దో
టుగట్టినకన్ను దూలగొన్నకన్ను - మోటుకన్నును పాపము
నిగినకన్ను - పోటుకన్నును పుండ్లుబుట్టినకన్ను - దో
షంబుదుర్మాంసదోషంబువాయు - దోషంబుపటలంబుమదక్షిణకృష్ణ
కాశయునతిరక్తకాశయు శ్వేత - కాశయునవెడిరోగంపునేత్రంబు - లా
దిగాగలసమస్తాంధులునత్తి - రోదనస్థులుదసప్రోలికేతేర - జెన్నార
గాళిదాసియుశివుచేత - గొన్నయామయ్యేడుగన్నులలోన - దారెం
డుగన్నులుద్ధతిధరియించి - వారివారికికనగనలుపుచ్చిపుచ్చి - యి
చ్చుచునంధులనెల్లరదనుప - నచ్చరువందిలోకావలిపొగడ - గ్రక్కు
నతమతమకన్నులరాక - కక్కజముగను బూర్వాంధులుమ్రొక్క - దా
సిడాసినమాత్రతమనేత్రరుజలు - వాసినయతగుల్తప్రణమితుల్గాను -
పూనియాకన్నులప్రోగులుసమయ - గానంధులకుదాసిదానంబుసేయ -
క్షితినంధులకునెల్లగృపజేసిశివుని - నుతియించిపడసెగన్నులుగాళిదాసి
యనగ్గనంధులలోననతనిపాంగెమున - కనుగవల్ వడయుటకష్టంబుగాదె
తక్కువయేమున్నతనివిద్యకంటె - నిక్కంబుమద్భక్తినిష్టగావునను - మతి
భక్తిరతిమెప్రమాణంబుగాగ - స్తుతియునునిందయుశూలికిగలవె - ప
డసెగన్నులశివుబ్రార్థించిదాసి - పడయుదునేనొండుభంగినెట్లనిన -
దేవుండుమాబావదేవిమాయక్క - వావిదీపరంగసవ్వరునకేమరది - క
రమనురక్తియుకారణంబుగను - గిరిజేసెగేకటగెమ్మటలాడి - యునుస
రసముజేసియునుగేలిజేసి - యునుమర్మములుజేసియునునగియించి - యా
లంబుజేసియునపహాసించియును - మేలంబులాడియుమెప్పించియిపుడు -
సాంబుచేబడతునష్టంబులేననుచు - నంబికానాథాంకుడమ్మానసదరు -
దొంగలింపగగొట్టదొనశంకరేశ - లింగంబుగుడివెన్కలీలగూర్చుండి -
మెచ్చులుదులుకాడమేలుకబ్బములు - జెచ్చెరనొకపేయుజెప్పిసంప్రటస -

మెచ్చిశంకరుఁడుసస్మితవక్త్రుఁడగుచు - మచ్చికనాముద్దుమరిదియంబన్న -
యోహోరివడయరూపుడిగ్గిముందటికి - రారయిచ్చెదమునేత్రములునీకను
డు - బావదేవరచీకువట్టినకోల - యేవచ్చువిధమింకనెట్లుముందటికి - సడ్డలా
పెనుగాకశంకరయేను - గ్రుడ్డినోమరినీవుగ్రుడ్డివో చెపుమ - కోలయిచ్చె
డివాడుగుడికడనుండ - జాలకననుబెట్టిచనియెనింటికిని - యంబయనిన
నెంటినరుగుదేనేర - నంబాయనిననెంటినరుగుదేనేర
నాకుముందరయనున్నతలోకనీవ - కాకదిక్కెవ్వ
రుగలరెలోకముల - యీదిక్కునాదిక్కుయేదిక్కునెరుగ - నీదిక్కెకా
కయీనిఖిలంబునకును - నీదిక్కయగుసర్వతోదయనీకు - నేదిక్కుముం
దరయేదిక్కువెనక - నటుగానవలతేనియక్కుమగండ - యిటుముఖం
బైకన్నులిమ్మనావుడును - భావింపముఖమంటపముబరివార - దేవత
లగువానుదేవవిరించి - రవిగజాస్యగుహాభైరవమాతృకాది - దివిజగ
ణంబునందియునట్లనుండ - వెనకముందరయయ్యెవింతసవ్వలర - దన
యున్నగుడియునుదానుశంకరుడు - వడిమృడుతోడనవచ్చెనేత్రములు -
గుడిదిరుగగగంటిగ్రుడ్డునుదిరిగె - హరుడభిముఖుడగునంతలోపలను -
కరమభిముఖములైకన్నులువెలిగె - నమ్మెనయాక్రియనతుముల్వడసె
నిమ్మహిజనులెల్లనెరుగంగమరియు - వెండినంఘుండిరిత్తాండియన్గణము
దండిమైమెమునుగాలిడాసినేత్రమ్ము - లెడపకనంధునకిప్పించికాని - పడ
యనెల్లండటేపటునేత్రయుగము - నేనటుగాకసన్నేచినయట్టి - జైను
లకన్నులీక్షణములోజెరిచి - మరికానిపడయనీమహికన్నులనుచు - గ
రకంఠునాజ్ఞదుష్కరజైనవితతి - కన్నులుజెడగజక్కనశోభియించి - కన్ను
లువడసెజక్కనయిరిత్తాండి యదిగాకశివనాగమయ్యయన్గణము - సద
పడినిత్యంబుబ్రాణేశ్వరునకు - మూడుసంధ్యలనేత్రములుసమర్పించి -
పోడిగాబడయుచుభువిబ్రవర్తింప - హుళిగరసోమేశుసుద్యద్దయాళు - డ
లరుచుశివనాగమయ్యనుజూచి - కట్టల్కసీవ్రాన్చుకనుదమ్మజోడు - లె
ట్టునుమాసవేయిడియాదిగాగ - క్రమమొందసోమవారముసోమవార -
మమితసద్భక్తినేత్రాబ్జములొప్పన్చు - మసవుడునట్లకాకనివారవార - ము
నుదప్పకన్నుకమమునలతనభక్తి - భవునిబూజించుచుబడయుచునుండె - శివ

నాగమయ్య చెచ్చెర నేత్రవితతి - మరియును గన్నప్ప మహిమ నీశాను - డె
రుగు నేత్రద్వయంబిచ్చుటగొనుట - యిచ్చెగన్నప్పము న్నీశ్వరార్థము
గ - నచ్చుగా శివుడు భక్త్యర్థమై యొసగె - యిచ్చుట శివునకే యిచ్చుట
గాని - యిచ్చుటగొనెననియిచ్చుటగాదు - బడయుటయు శివేచ్ఛ బడయు
టగాని - బడయంగవలెనని బడయుటగాదు - కన్నప్పదేవుడొక్కడక
దాయాది - కన్నులిచ్చినవాడు గౌరీశ్వరునకు - కన్నులుగొనిమెడిగణము
లేకాని - కన్నులిచ్చినవారిగా నముగ్రునకు - గావున కన్నప్పకన్నులయియా
గి - దావిపరింపనెంతయు నొప్పమరియు * నుదయమజ్జనకాలమిదిగదా
యనక - మడియించి సిద్ధించి మురదినయట్టి - మిక్కిలిద్రోహులుమీర
శాకనుచు - గ్రక్కునతన రెండుకన్నులుగెలకి - సుప్రసిద్ధంబుగా హోలి
బూజించి = యప్రవృత్తాక్షంబులాక్రమంబునను - మహిబడయు డెభక్తి
మతి వెల్లగొండ - మహాదేవశరణుండు మరియట్లగాక * స్థిరకీర్తి కంగళ
దేవయ్యనాగ - పరుసతో దానుశ్రీపర్వతంబేగి - కన్నులువుచ్చి శ్రీకంఠు
బూజించి - కన్నులుబడసియాక్షుణమ యేతేర - నింతవేగమున నెట్టేతెం
చెకన్ను - లింతవేగంబున నీశానుచేత - దానెట్లువడసెనింతయు గుటిలం
బు - గానోపునని కూడి ఖలులు నిందింప - దట్టుండువారి చేతనయొక్కపి
ల్లి - బట్టి తెప్పించిసభామధ్యమునను - ఖలులచేతనె పిల్లికన్నులు రెండు-
దొలగించి సకలభక్తులనాత్మదలచి - కరుణాత్మయీపిల్లికన్నులీకున్న -హ
రయసంఖ్యాతులయాన సీకనుచు - గడునుబ్బియాపిల్లికన్నులక్షణమ - బ
డసెనాదేవన్న ప్రతిజనుల్ సూడ - నపేక్షించి బడయుటయరిదియేకన్ను -
లపేక్షింపక వడయుటదిగొప్పగాక - యేలయిట్టివి వేయునన్న ముక్కంటి -
శాళివెట్టియనంగగణనాథుడొకడు - మిక్కుటంబుగ దొలిమేనిపుణ్యము
న -ముక్కంటితోననమును జనియించి- మేదురకీర్తి మైమించి లోకముల
నాదిసాక్షాత్త్రినయనుడనినడవ - కరికాలచోడడన్గణనాయకుండు - వర
వీరభక్తిప్రవర్తనశాలి - పోసికభోజనపూజాఘ్యపాత్ర - యానలు
వుడిపించియాధృతిగనక - వర్షంబుగురియునావారకననక - వర్షంబు
గురియించి వసుధపైనంత - నభ్రంకషస్ఫాతిసలమిపారంగ - విభ్రమలీ
లకా వేరిగట్టుచున్న - ముట్టినమహిమ మొముక్కంటికాళి - వెట్టనికావేరి వె

ట్టికిబిలువ - ముక్కంటివాడేలమును వెట్టిసేయు - నిక్కంటివానికినేజే
యననుఘ - నిచ్చినవాడెవ్వడీనేత్రమనుచు - నచ్చుగానేత్రంబునతని
రూపంబు - ముంగతిత్రవాయించిమొగినెడగాలి - యుంగటంబుననిట
రొత్తిముక్కంటి - కాలివెట్టెనుసలికన్నటువగుల- కాలివెట్టియునహం
కారంబణంచె - కరికాలచోడవిక్రమచక్రవర్తి - కరులుసాష్టాంగులై
యటబ్రబణమిల్లి - కరికాలచోడనీకరుణాతిశయత - పరగంగముక్కన్ను
బడసెగావునను - యాకాళివెట్టిమహాత్వమెంతనిని -రాకరించెగడునస్తోక
ప్రతాపి * వెండియుద్యద్భక్తివిక్రమాన్వితుడ - ఖండితకీర్తిశంకరదాసి
యనగ - ముక్కంటిచేదనుముక్కన్నువడసి - తక్కననిఖిలాన్యదర్శన
స్థులను- క్రొవ్వణగించుచుకుటిలదర్శనుల - ముఖ్వెట్టిగొనుచుండెమును
మహాబాద్ధతిని - యన్యదైవ్రొద్ధపర్వహారణార్థముగను - ధన్యుడై శం
కరదాసిదేవయ్య - ముక్కంటిచేకొన్నముక్కన్నులందు - నొక్కనేత్ర
మకాదెయూర్ధ్వనేత్రంబు - కరకంఠుచేనిట్లుకన్నులువడసి - మెరసినభ
క్తులమిక్కిలికరుణ - బండితస్తుతునకుదండితాఘునకు - పండితమల్లిదిగ్భ
ద్రగజమున - కూర్ధ్వనేత్రద్వయంబొప్పచోద్యముగ - నూర్ధ్వలోచ
నునిమహాద్యతకరుణ - నరయనేత్రములుసమర్పణజేసి - వరలంగ
బేర్చినవారినెల్లెడల - గండుమువిందుముగాకలోకముల - గంపుమే

——( సంబెన్నకథ. )——

విందుమొకథలందుమరియు - నాడెల్లనెరుగంగసంబెన్నయంత - వాడును
నేత్రమిాశ్వరుచేతమగుడ - వడయునప్పడునిజాంబకముగాకిట్లు - వడిని
డుకన్నుగావడసెసెనాడె - యానంబిమహాత్మ్యమదిరొట్టిదనిన - దా
నీశ్వరునకై నదలపనక్కజము - కావేరియామ్యభాగంబునమరియు -నా
వలూరనునగ్రహారంబునకును - యిరువుకుజంగములేతెంచినంబి - తిరు
పాటలర్థిసంధిల్లబాడుచును - వరదానమునకేగవనితాలలామ - పిరి
యునంగయనంగవృథుభక్తినిరత - వరగుణిరొుక్కశివద్విజురాలు - వ
రదానమిడుటకువచ్చియాలించి-యాతిరుపాటలిందెవ్వరికవిత- లీతిరుపాట
లకేమియర్థంబు - పాడినవినినసేఫలముబ్రాపించు - వేడుకజెప్పుడావి
నిమొదనినిన - యాతిరుపాటలభీష్టార్థకరము = లీతిరుపాటలైహికసు

ఖకరము = లీత్రిపుపాటలహీనసౌఖ్యాభి = జాతంబులగుమోక్షసౌఖ్యహే
తువులు = ప్రతిరేనియాత్రిపుపాటలశివుని = నుతియించిమించుధన్యుని
ఖ్యాతి జూడు - మంబికాధవుభక్తుడసమానిమోక్షయ = నంబినా
భక్తగణశ్రేష్ఠుడతని - చారుచరిత్రమాశ్చర్యమెట్లనిన - గౌరీవివాహా
భిగమనకాలమున - మృడుడీశుడుశివుండు మదురకీర్తి - కడుబాడంగ
దరశృంగారంబుజేసి - వినువీధిదాకినవినయవిస్ఫురణ - దనరారునిలువు
టద్దంబుసూచుచును - ఇలజాప్తకోట్ల తేజముధిక్కరించు - విలసితనిజ
దేహవివిధవిలాస - మతులితోద్యద్దర్పణాభ్యంతరమున - ప్రతిబింబమై
కానబడుచుతదీయ - సౌందర్యమునకునాశ్చర్యంబునొంది - సుందర
నేయనిచూచిహర్షించి - సుకరస్వకీయభాసురదృక్సముదిత - ముకు
రస్ఫురితమూర్తిమూర్తీభవించి - యరుగుదెంచిధరణి సాష్టాంగమెర
గ - కరమర్థిలేనెత్తి కౌగిటజేర్చి - మందస్మితముఖాంశుమంజరులొ
లయ - సుందరాత్మీయవిస్ఫూర్తిమూర్తి - యగుటసుందరుడవీవ
నిపేరుమోపి - తగిలిశంభుండుసుందరగణాధ్యునకు - వరకృపామతిగణ
త్వముప్రసాదించి - పరిణయోత్సవముశుంభల్లీలసలిపి - నగజయుదా
నునన్యోన్యసంప్రీతి - దగిలిసుఖింపంగదానొక్కనాడు - హరుసకుసుం
దరుడర్థిపుష్పముల - కరిగియుద్యానవనాంతరంబునను - మున్నద్రి
జకుపుష్పములకనివచ్చి - యున్నకనకలతయునుగాంతిమతియు - నను
సతులునుదానునన్యోన్యరక్తి - మనసిజక్రీడలమసలియేతేర - కామసు
ఖాపేక్షగలుగుముప్వురను - కామాపహారియుగౌరియుజూచి - భువి
ముప్వురునసిల్లపుట్టుండితనికి - యువిదలైపుట్టుండుయువిదలిద్దరును - త
నివ్రూనభువినిసతినసుఖాంభోధి - ననయంబునోలాడసరుగుండువెండు
నావుడుదండప్రణామములొ జేసి - దేవదేవేశ్వరుదేవీశ్వరానుచు - నిల
నొప్పద్రవిళమహీస్థ[illegible]ంను - నలిద్దరువాలూరనంబియర్లపేర - వసి
సుందరుండుశివ[illegible] - జ[illegible]యారికి పుణ్యశాలికిబుట్టె - ధరనంద
కనకలత[illegible]యుదయించె - బరమునాచియనంగబంచములందు - మంగ
లూరనుగాంతిమతియు నెనంగ - నంగనామరిశూద్రజాతిజనించె - శం
భుమూర్తినిసంబిజడయూరియంత - శాంభవదీక్షాభిజాతుగావింప - నా

నంబియును సంతసనుదినవర్ధన - మానాంగుడుగ గర్మమతిజడయారి -
కపిముఖ ప్రియనిభుగ భాణ్టకమున - నుపనయనము సేయుచున్న యత్తరిని -
ఆరుద్రుడు నగయూ తేరుద్రయనగ - శ్రీరుద్రసూక్తసంచితభాష్యసరణి
ధరణిచరద్విప్రతనుగాగ శ్రుతుల - బరగుజరాక్రాంతభావంబుదాల్చి -
కృతకంపువిప్రుసద్ధతి నేగుదెంచి - యాతడుమీసుతుడేమాయిలుపట్టుబ
న్న - వడుగుసేయగ నేన్లువచ్చుమాదాసి - కొడుకనియానంబికుశి రెట్టబట్ట
సరసబుణ్యాహవాచసమాచరింపు - వదవిప్రులును బంధువర్గంబుసూచి
యతిచోద్యమంది బ్రాహ్మణవృద్ధుముడిసి - మతిదప్పినాడొయుష్మత్త
డో భ్రమసె - నోకృతకవుదైత్యుడో తస్కరుండో - కాక యిట్టిపెద్దమొం
దుగల్గు సేయనుచు - చెచ్చెరనేతెంచి చెనులిఫిబాపి - పుచ్చుచునటు
ద్విజుబాహ్మని త్రోవ - సాడసాడలోవ్వుచు నోలుచుబాడి - బడిపూజకుం
డలుపగలదన్నుచును - బడిలేచిమరివచ్చిపట్టుడు ద్విజులు - పెడకేలుగా
బట్టిబిట్టుద్రోచుడును - వడకుచుదిరుగుచువచ్చియాఘుడియ - కుడకల
పైబడిగూలద్రోచుచును - మరివచ్చిపట్టిబ్రాహ్మణులుగోపించి - యరి
ముఱిమొడవట్టియకాలనూకుడును - పడిపడిమరియంతపందిరికాళ్ల - నడు
గులుపెనగొల్పియరుగకయూప - దండడియగ్నిహోత్రముమీదవ
డుడు - పందిరిగుబ్బునబడిమంటలెగయు - దిగ్గునలేచిన బైసలబారుచు
ను - యగ్గిలోనసబడియరిగెడివారు - యిండ్లపైపైనెక్కి యటనేగువారు
గండ్లనుదూరి వేగమెపారువారు - జప్పరంబులుసూకిచనియెడివార -
లిప్పాటజనలేకసిగ్గైడువారు - గోడలువడద్రోచికొనిపోవువారు - కూ
డముట్టినయగ్నిగొనికాలువారు - గనుకనియెంతొంటగడవంగవిప్ర -
జనులివ్విధంబునజక్కనసరుగ - మూకలోనజొచ్చిముచ్చుముట్టనంబి -
జాకిటనిముకోనిజడయారియరుగ - దనబిడ్డనుచుమాదాసిబిడ్డనియు - గొ
నిపోవుచున్నా ముకుటిలంపుటరవ - చూడండిపౌరులంచుసుజనివాడ - వా
డలమొరలిడిపడిబారిపట్ట - గరమప్భుతంబనికరికాలచోడ - నరపతియ
ద్యుపనయనవిఘ్నంబు - ముదుకవిప్రుడుగూడమొరలిడుటయును - గదిసి
ముంచరియిండ్లుగాల్చివచ్చుడును - సభయును దానువిచారించిచూచి - యు
భయువాదులగోలుపుండిపిల్పింప - గొడుకుచాకిటనిడికొనుచు నేడ్చుచును

ముజెప్పనొప్పు - మనుమపండితుడుభీమనపండితయ్య - యనుమహాదేవ
య్యయును జెన్నవిభుఁడు - ననగగురుచతుష్కమాత్మసంతాన - తనయ
పరంపరోత్తరపరంపరలు - పరిచితగురుపరంపరదేజరిల్లు - ధరవృషభేం
ద్రునపాదచతుష్కసరణి - ధ్రువపురుషార్థచతుష్కవిస్ఫురణ - సవిశేష
భవ్యమోక్షచతుష్కహేల - వాలారుశ్రీనగద్వారచతుష్క - లీల
వార్థిచతుష్కవేలాధరిత్రి - సముదితమహిమదచ్ఛైవసంతాన - విమ
లాంబునిధిమధ్యవిభ్రమానఘుర్య - నాయకరత్నంబునాలోకగురుస -
మాయతప్రథితనొప్పారివటూరి - సోమనాథయ్యవిశ్రుతపీరభక్తి -
భూమాభిరామవిస్ఫురణవెలుంగ - వారిపుత్రులుభక్తివర్ధనపరులు -
సూరీశ్వరుండులోకారాధ్యపదవి - హారుండువిశ్వనాథప్పయ్యగారు -
కారుణ్యనిధులుసింగనమంచిగారు - ననగగురుత్రితయాన్వయతనయ -
తనయపరంపరోత్తరపరంపరలు - ప్రభుతరగురుపరంపరదేజరిల్లు - త్రిభు
వనంబులబర్వెత్రిపథగభాతి - వేదత్రయవిభాతివిశ్రుతాగ్నిత్ర - యోది
తకలితమహోన్నతఖ్యాతి - దానిట్లుకృతిసమాప్తంబయ్యెనంత - మానుగా
దుదిపంచమప్రకరణము - నరయనీకృతిసారమగుజతుర్థప్ర - కరణమ
ధ్యమునసంకలితమైవెలుగు - సవ్యగణసహస్రనామస్తవంబు - భవ్య
ముగబఠించుఫలలేశమునను - నైహికాముష్మికాద్యఖిలసంపత్స - మా
హితాభీష్టముఖ్యములొందుననిన - ప్రమథరుద్రాదిపురాతననూత -
నమహాగణాభివర్ణనములోకముల - నారూఢమతిమల్లికార్జునపండి -
తారాధ్యచరితమాద్యంతంబువినిన - చదివినవ్రాసినసంగ్రహించినస -
ముదితాభిమతఫలంబులువొందుటకుదె - కావుననీకృతిగారవించినను -
వావిరిజదివినవ్రాసినవినిన - నరుదొందవారలకభిమతార్థములు - గ
రుణించుశివుడుమంగళమహశ్రీలు,

ఉ ॥ శ్రీభసితత్రిపుండ్రక పరీతవిశంకట ఫాలుజాటజూ ॥ టీభ
రధారు నిర్మలపటీపట లావృతదేహు నక్షమా ॥ లాభరణాభిరాము
బసవాక్షర పాఠపవిత్ర వక్త్రుచి ॥ చ్ఛోభితచిత్తుపాల్కురికి సోమయ దే
శికు బ్రస్తుతించెదర్ ॥

శా ॥ శ్రీమన్మ[illegible] శ్రీ[illegible] మల్లేశ్వరున్ ॥

ధీమంతున్ నిగమాగమస్మృతిమతో ద్గీతార్థ వేత్తన్ బుధ స్తోమస్తుత్యప్ర
భుమార్గ్యనేత్రయుగునా ద్యుంబండితారాధ్యులన్ గామించి నుతి
యింతుగొల్తుదలతున్ కామ్యార్థసంసిద్ధికిన్ ॥

—* గద్య. *—

ఇది యసంఖ్యాత మాహేశ్వర దివ్య - పద పద్మ సౌరభ భ్రమ రాయ
మాణ - జంగమలింగ ప్రసాదోప భోగ - సంగత సుఖసుధా ర
సనిమగ్న - సుకృతాత్మ పాలకురికి సోమనాథ - సుక
వి ప్రణీత భాసురతర దండ - నాయక బసవాంక
సఖ్యాత గుణగ - ణాయతకీర్తి దిగంత
త్రిలోక - గురుపండి తారాధ్యచరి
తంబు నందు - బరు వడి
పంచమ ప్రకర
ణము.

శ్రీ

ఓం నమశ్శివాయ.

ఈ గ్రంథములు కలయువారు మాకు వ్రాయు అడ్రస్.

శ్రీ శివధర్మవర్ధనీ రామలింగేశ్వర ముద్రాక్షరశాల,
ఆకవరపు వెంకయ్యగారి తోట! యింతేసార్ గంజు,

వరంగల్.

—o—

సౌమ్య సం ॥ ఆషాఢ శు ॥ ౮ యిందువాసరం.

శా. 1831.

